





# మహిళలు

## జీవిత చరిత్ర,ధర్మాలు

# పుణ్య స్త్రీలు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలుపైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలుపైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015094

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పుణ్యస్త్రీలు

*

ప్ర కా శ కు లు :

జ్యోతిర్మయీ ప్రచురణాలయము

గుడివాడ

*
* *

హక్కులు] 1943 [రు. 2/-లు

# ప్ర వే శి క:

పుణ్య చరితాత్మక స్త్రీ పురుషుల పాదచిహ్నములచే పవిత్రీభూతమైన భారతదేశేతిహాసము రత్నస్థగితము. ఆక సమునందు దేదీప్యమానకాంతిపుంజములతో విరాజిల్లు తారలు అంధకారమున పాంథులకు మార్గదర్శిక లైనటుల, ఈ పావన చరితల జీవగీతికలు ఎల్లకాలముల వారలకు అజ్ఞాన తిమిరమును బాపు దివ్యజ్యోతులవలె మెఱయుచున్నవి.

అట్టి పూజ్యజనావళినుండి సౌశీల్యముచే గాని, విజ్ఞానసంపత్తిచే గాని, శౌర్యసాహస కృత్యములచే గాని, దేశాభిమానపరతంత్రతచే గాని, సేవాతత్పరతచే గాని, మహౌదార్యాది గుణవిశేషములచే గాని, తమ యుత్తమ జీవితములను, పుణ్యవంతములుగ జేసికొని యెల్లకాలము వారికి నాదర్శప్రాయులైన కొందఱు పుణ్యస్త్రీల చరిత్రలు, ఈ సంపుటియందు సుబోధకమగు నటుల సులభశైలిని వ్రాయబడినవి. ఇట్టి మహిళాలలామల సచ్చరిత్ర పరిచ యముచేత పాఠకులు విజ్ఞానవల్లికను వృద్ధిచేసికొని, తమ ఆదర్శజీవిత కుసుమములచే భారతదేవీమూర్తిని అలంకరిం చెదరుగాక.

ఆదర్శాభిలాషిణి.

# శీర్షికలు

## ఒకటవ భాగము



## రెండవ భాగము

## మూడవ భాగము

శ్రీ

# పుణ్యస్త్రీలు

ఒకటవ భాగము

## ఒకటవ కథ: *** మొల్ల.

### 1

పూర్వకాలమునఁ దెలుగు స్త్రీలలో గవిత్వము జెప్పెడివా రరుదు. కాని, కవిత్వము జెప్పి గణుతి కెక్కిన యాంధ్ర వనితా రత్నములలో ఆత్మకూరి మొల్ల ప్రథమస్థానమును బడసి కీర్తి గడించెను.

మొల్ల కులాలకులసంభవురాలు. ఈమె తండ్రి కేశనశెట్టి. ఈతనికి కేశయ యను నామాంతరము కలదు. నెల్లూరు మండలములో నున్న గోపవరము ఈతని జన్మస్థానము. ఇతడు దైవభక్తి కలిగి కుల ధర్మములను విడువక, పెద్దలయెడ విధేయుడై సంచరించెడివాడు.

మొల్ల లేక లేక కలిగిన యేకపుత్రికారత్నమగుటచే నీతడు తన కూతును మిగుల గారాబముతో బెంచుచుండెను. ఏది తలచినను, నేది చేసినను కేశయ తన కొమార్తె సౌఖ్యము నరసి శ్రద్ధ వహించెడివాడు.

మొల్ల జన్మించినది కుమ్మరికులమైనను, నామె పసితనము నుండియు దన తల్లిదండ్రులు చేయు కులవృత్తి పనులయం దెట్టి యభిలాషయును జూపలేదు. ఆమె తనతోడి బాలికలతో నెప్పుడును రామ విగ్రహమును బెట్టి యాడుకొనెడిది. ఎప్పుడును రామకథ వినుటయం దామె కత్యంతాసక్తి. తన చిన్ని స్నేహితురాండ్రను, తల్లిదండ్రులను,

నింటికి వచ్చిన బందుగులను నానందజనకమగు రామాయణగాథను జెప్పుడని వేడికొనెడిది. పసితనమునందు విద్యాభ్యాసము గాక పూర్వము గూడ, నామె యెప్పుడును నేదో యొక పుస్తకమును జేతబట్టి చదువనేర్వక పోయినను, గ్రంథపత్రములను ద్రిప్పుచుండెడిది. దాశరథి నామము మృదుస్వరముతో నుచ్చరించుచు పలువుర బాలబాలికలను జేర్చి రామ కథను జెప్పెడిది. స్నేహితురాండ్రను సమావేశపఱచి, తాను రాముడనియు, మఱియొకరు లక్ష్మణుడనియు, పలువురకుఁ బలు పాత్రల నిచ్చి, రామాయణ నాటక మభినయించెడిది.

ఇవన్నియు జూచి కేశవశెట్టి యమందానందమును బొందెడివాడు. తన ముద్దుకొమరిత యొక్క మితిలేని విద్యాభిలాషను గ్రహించెను. అందువలన కేశయ యామెకు సుముహూర్తమున నక్షరాభ్యాసమును జేయించి యొక వీధిబడికి బంపెను.

ఆ పాఠశాలయం దామె తన తోడివిద్యార్థినులకంటె మిన్నయై గురువు చెప్పినదంతయు గుతూహలముతో నేర్చికొని, యనేకములైన క్రొత్త క్రొత్త విషయములను దెలిసికొనెను. అనతికాలములో నే నామె గొప్ప పాండిత్యమును సంపాదించి యటుతరువాత నింటనుండియే పెక్కు గ్రంథములను బఠించి, విశేష విద్యాపారంగతురాలయ్యెను.

## 2

తెలుగునకంటె సంస్కృతమున మొల్లకు నెక్కువ ప్రీతి. ఈకాలమున క్షీణించిన సంస్కృతభాష యానాడు రాజభాషయై యపూర్వగౌరవప్రదముగ జూడబడుచుండెడిది. అట్టి సంస్కృతభాష యందు మొల్ల యనేక కావ్యములను బఠించి వాని మాధుర్యమును గ్రోలి, యానందసాగరమున నోలలాడుచుండెడిది.

మొల్లయొక్క పఠన కావ్యములలో, నామె కెక్కుడు ప్రియతమమైనది రామాయణము. ఋషిపుంగవు డగు వాల్మీకి యతి రమ్యముగ రచించిన రామాయణ మామెదృష్టిని సంపూర్ణముగ నాకర్షించెను. ఆ యుత్కృష్ట గ్రంథము నెట్టులైన దేశభాషనుండి యాంధ్రీకరించి యాంధ్రులకు గూడ నందలి మాధుర్యమును చవిజూపవలెనని యామె యభిలషించెను.

తన యభిమతము నెఱవేఱువఱకును మొల్ల హృదయ మన్యాసక్తము కాలేదు. అప్పటి కామెకు సాహిత్య మెంతయున్నను కవితా సామర్థ్య మంతగా లేదు. అయినను నామెకు శ్రీరామునియందు భక్తి యపారము. అదియే యామె పవిత్రోద్దేశమును నిరంతరాయముగ నిర్వహింపగల్గెను. అందుచేతనే యామె,

"...ఇహాపర సాధన మిప్పుణ్య చరిత్ర" యను నమ్మికతో రామాయణ రచనకు గడంగుటకు బూర్వము,

"............విఖ్యాత గోప
వరపు శ్రీకంఠ మల్లేశు వరముచేత
నెఱిఁ గవిత్వంబుఁ జెప్పఁగా నేర్చుకొంటి"

యని వ్రాసుచెను.

అట్టి దైవకృప యుండుటచేతనే స్నానముచేసి తలయారులోపల నొక కాండమును రచింపగల్గిగ యాశుధారాశుద్ధిని బడసి, మొల్ల రామాయణమును హృదయరంజకముగ రచించి యాంధ్ర భాషా యోషకు నమూల్యాభరణమును జేకూర్చ గల్గినది. ఈనాటికిని "మొల్ల రామాయణము" పలువురుచే ప్రీతితో బఠింపబడు చుండుటయు, భక్తిశ్రద్ధలతో నాకర్ణింపబడు చుండుటయు, నెల్లరకు దెలిసిన విషయమే.

# 3

ఒక భాషలోని గ్రంథమును మఱియొక భాషలోనికి మార్చి వ్రాయుట మిగుల కష్టసాధ్యమైన పని. ఎంతయో సాహిత్య విజ్ఞాన సంపత్తియును, మేధాశక్తియును, నుభయభాషాప్రావీణ్యమును నున్న గాని, యట్టి పని నెఱవేఱదు. అట్టితఱి, మొల్ల తల్లిదండ్రులు విద్యా విషయమున సామాన్యులు. 'వీధిబడి' యందలి విద్య యంతగా జెప్పు కొనదగిన విషయముగాదు. అట్టి పరిస్థితుల నడుమ శ్రీమద్రామా యణమును సంస్కృతము నుండి తెనిగించి, యనన్యసాధారణ కార్య మును మొల్ల నెఱవేర్చెనన్నచో గడుంగడు శ్లాఘనీయము. కాన, నామె కావ్యరచనాచతురతయు, భాషాంతరీకరణనైపుణ్యమును, కేవ లము నీశ్వరప్రసాదితములే యని చెప్పవలసి యున్నది.

నిజముగ దన పుణ్యమహిమచేతనే మొల్ల, రామాయణ గ్రంథ మును దెలుగున నత్యంతరమ్యముగ రచించి, శాశ్వత కీర్తిని గడించి, పవిత్రగ్రంథకర్త్రియై, పుణ్యాంగనాప్రపంచమున ముఖ్యస్థానమును బడయ గల్గెను. మొల్లయొక్క యపార విద్యాభిలాషయు, నిరుపమాన భగవద్భక్తియు, స్త్రీలోకమున నత్యంతాదర్శ ప్రాయములై యున్నవి.

పూర్వజన్మ సుకృత పరిపాకమున గాని లభింపని కవితావిశే షము నంది, యసామాన్య మగు గ్రంథనిర్మాణ భాగ్యమును బడసి, యెన్నటికిని సౌరభమును గోల్పోని గ్రంథకుసుమముచే సహృదయు లకు నామోదము ఘటింపజాలిన మొల్ల జీవితము మిగుల ధన్యతమ మైనది.

సత్కావ్యమణికిరణపుంజముచే భాషావధూటి నలంకరింప గలుగు గ్రంథకర్త్రి యెంతయు పవిత్రాంగన.

# రెండవకథ: ⁂ మల్లమదేవి.

## 1

బొబ్బిలి రాజ్యమునుగూర్చి వినని వారాంధ్ర దేశమునం దొక్కరు గూడ నుండరు. రంగారాయని శౌర్యమును గూర్చియు, తాండ్ర పాపారాయని సాహసమును గూర్చియు, మల్లమదేవి త్యాగమును గూర్చియు గర్వింపని యాంధ్రులెవరు? నేటికిని, ఈ వీరనామములు సగౌరవముగ నాంధ్రులచే సంస్తుతింప బడుచున్నవి.

ఇందు మల్లమదేవి త్యాగమూర్తి యని ప్రసిద్ధిగాంచినది. ఆ కాలమున శత్రుసైన్యము లనెడి మేఘములు బొబ్బిలి సంస్థానము నావరించినవి. ఎటుల యోచించినను బొబ్బిలివారికి పరాజయ మగు నట్లు గనుపించెను. అట్టిశతి, శత్రువులచేత జిక్కుటకంటె, మానమును రక్షించుకొనుటకు నాత్మత్యాగమే శుభదాయక మని మల్లమాంబ గ్రహించెను. "వైరులు కోటలోనికి బ్రవేశించునరికి నొక్క మనుష్య విగ్రహముగూడ నుండరాదు. ఎటుజూచినను వినాశమే వారి నెదు ర్కొనవలెను" అని యామె నిశ్చయించెను.

బొబ్బిలి ముట్టడి తొలుత యెట్లు సంభవించెను? ఆ దినములలో ముజఫరుజంగు అను తురక రాజుండెను. అతనికి హైదరాబాదు రాజ్య మును బొందవలెనని కోరిక కలిగెను. అందుల కాతడు పరాసువారిని సహాయము కోరెను. అట్లు చేసినచో, ఉత్తర సర్కారులను వారికి కానుకగా నిత్తునని వాగ్దానము జేసెను. సంతోషముతో పరాసువా రందులకు సరి యనిరి. అనతికాలములోనే ముజఫరుయొక్క కోర్కె నెఱవేఱెను. ఇక నాతడు తన మాటను చెల్లింపవలసి యుండెను.

కాని యుత్తర సర్కారులను పరాసు వారికి సమర్పించుటకు వచ్చటి ప్రధానరాజగు విజయరామరాజు సమ్మతింపలేదు. "ఇట్లు చేసినచో, విదేశీయులగు నీ పరాసులు సమయము దొరకినపుడు మన లనుగూడ నెత్తియణతురు. కావున నిట్లు చేయుట క్షేమముకాదు" అని ముజఫరుజంగున కాయన కబురంపెను.

ఈ వార్తను ముజఫరు పరాసువారికి దెలియజేసెను. విజయ రామరాజును జయించుట కష్టమని వారు గ్రహించిరి. అందుచేత వానిని సామోపాయమున దమ వైపునకు మరల్చుకొనుటకు బ్రయత్నించిరి. అందునిమిత్తమై, విజయరామరాజునకు పరాసువారు రాజమహేంద్ర వరమును, శ్రీకాకొళమును, నే కొలది శిస్తునకో కౌలునకిచ్చిరి. ఆనంద పరవశుడైన విజయరామరాజు, అప్పటినుండియు పరాసువారి మిత్ర మండలిలోని వాడయ్యెను. పరాసువారి పన్నుగడ యాతనికి దెలియ లేదు.

విజయరామరాజుయొక్క చర్య వినినతోడనే, బొబ్బిలి రాజు లాగ్రహాపూరితులైరి. ఇంతదనుకను దమతోడి సమానుడుగ నున్న విజయరామరాజిప్పుడు 'గూడుఘుఠాణి' జేసి, పరాసువారి యాప్తుడయ్యెనని వారికి గోపము. అటులచేయుట తక్కిన సంస్థానాధిపతులకు గూడ ననర్థదాయకమని వారి నమ్మకము. అందుచే వారు తమ యసమ్మతిని వెల్లడిచేసిరి. దానంజేసి బొబ్బిలివారిమీద విజయరామ రాజునకు మిక్కుటమగు పగ యేర్పడెను.

ఇదియును గాక, వారి వైరమునకు మఱొక కారణముగూడ నుండెను. విజయరామరాజొక సమయమున బొబ్బిలివారిని కోడి పందెముల కాహ్వానించి యుండెను. తోడి వెలమశూరుని యాహ్వానము నంగీకరించి, తమ కోడిపుంజులతో బొబ్బిలి సంస్థానాధిపతులగు

వెంగళరావును, రంగారావును వచ్చిరి. ఇరువైపులవారి పుంజాలకును పోరు జరిగెను. విధివశమున విజయరామరాజు పుంజు లోడిపోయెను. ఆతనికి నలుగురిలోన తలవంపు లయ్యెను. అప్పటినుండియు బొబ్బిలి వారన్నచో నాతనికి కన్నెఱ్ఱ. పగబట్టిన త్రాచువలె విజయరామరాజు ప్రతీకారమునకు సమయ మెప్పుడా యని నిరీక్షించుచుండెను.

## 2

సందర్భము లిట్లుండగ, ఉత్తరసర్కారులవారు శిస్తులను క్రమముగ చెల్లించలేదను నెపమున, పరాసువీరు డగు బుస్సీదొర కొంత సైన్యముతో బయలుదేరెను. సైన్యసమేతముగ బుస్సీ రాజమహేంద్రవరము చేరి, యటనున్న కోటిలింగక్షేత్ర సామీప్యమున మకాముజేసి, యుత్తర సర్కారులలోని రాజులందఱకును కబురంపెను. అందఱును వచ్చిరి. విజయరామరాజు గూడ జేరెను. కాని బొబ్బిలి వారెవ్వరును రాలేదు. బొబ్బిలిసంస్థానమందొక గొప్ప పెండ్లి జరుగుచున్నదను కారణమొకటియు, పరాసువారు విజయరామరాజున కాశ్రయమిచ్చిరను కారణమొకటియు, బొబ్బిలివారు రాకుండుటకు గారణములయ్యెను.

ఏ కారణమెటులున్నను, వారి రాపోవికి బుస్సీకి పట్టరాని యాగ్రహము గల్గెను. తాను వేచియున్న సమయము వచ్చినదని గుర్తించి, విజయరామరాజు బుస్సీ యాగ్రహమును రగుల్కొల్పెను. తనయంతటివాడు కబురంపిన రాకపోవుటయా యని బుస్సీ కినుక వహించెను. "ఎన్ని కష్టములు పడియైనను బొబ్బిలి బెబ్బులిని జెఱ పెట్టవలెను'' అని వారు దృఢముగ దీర్మానించుకొనిరి.

వైరి సైన్యముల తుపాకిగుండ్లతో, శతశతలాను కత్తి మెఱుపులతో, చెవుడుగొల్పు వీరాలాపములతో, బొబ్బిలికోట చుట్టునున్న విశాలప్రదేశమంతయు క్షణకాలములో రణరంగముగ మాఱి పోయెను. సంగతియంతయు నతిసూక్ష్మతతో గ్రహించి బొబ్బిలి కోటనుండి కొదమసింగములవలె వెలమవీరులు కత్తిసాము చేయుచు బయల్వెడలిరి. వీరులగు రంగారాయుడు, వెంగళరాయుడు, నర్సా రాయుడు, పాపారాయుడు రణక్షేత్రమున దుమికిరి. యుద్ధము ప్రారంభ మయ్యెను, అది మహాభయంకర దృశ్యము. ఎక్కడ జూచినను శవముల కుప్పలు, మొండితలలు, రక్త ప్రవాహములు. ఇంకను శౌర్యాగ్ని జ్వాల లెగసినవి. ఇంతలో నిదియంతయు జూడలేక పోయెనో యనునట్లు లోకబాంధవు డస్తమించెను. క్రమముగ యుద్ధవైఖరికూడ మాఱి పోయెను. ఏబదివేల శత్రువులతో నైదాఱువేల వెలమవీరు లెంత కాలము పోరు సల్పగలరు? బొబ్బిలివీరులు కొంత సంశయము జెందిరి. "గెల్చుట కష్టమే" యని రంగారాయుడు రాణి మందిరమునకు వార్త నంపెను.

# 3

మల్లమదేవి రంగారాయుని భార్య. ధైర్యసాహసముల కామెకు బెట్టినదిపేరు. భర్త పంపిన వార్తను వినినంతనే యామె ముఖమున చిఱునవ్వు కనబడెను. వీరపురుషు లందఱును రణమున ప్రాణత్యాగము జేయుచుండ, వీరవనిత లగు మేము మాత్ర మూరకుందుమా? మేముకూడ మా భర్తలతో బాటు వీరస్వర్గమును జూఱగొన కుందుమా!" అని యామె యుచ్చైస్స్వరముతో ననెను. కోటలోని స్త్రీ లందఱను దన కడకు రప్పించెను. వారెల్లరికిని ధైర్యము బురికొల్పెను.

భార్యలకు భర్తలే దైవములగుటచే, సహగమనము స్త్రీలకు మిగుల శ్రేయస్కరమని బోధించెను. తానే ముందడుగువైచెను. కత్తితో బొడుచుకొని వీరమల్లమ ప్రాణములను గోల్పోయెను. రాణివాసమంతయు నామె త్రొక్కిన మార్గము ననుసరించెను. జయము గాంచిన శత్రువులు లోనికి వచ్చునరికి, కోటయందొక్క స్త్రీ యైనను జీవములతో మిగులలేదు.

నాటికథ నేటికిని చెప్పికొందురు. అలనాడు వీరవనితలయందు నద్వితీయయై, తన జీవితమును పుణ్యవంతముగ జేసికొని, మల్లమదేవి యెత్తిన యాత్మగౌరవ మను బావుటా, నేటివఱకును నాంధ్రశౌర్యదుర్గముపై విలాసముగ నెగురుచున్నది. ఈ పుణ్యస్త్రీయే వీరమల్లమదేవి యను పేరట దిగంతవిశ్రాంతకీర్తినిగాంచి, భారతవనితాలోకమునకు నాదర్శయై విలసిల్లుచున్నది.

శౌర్యవాహినియై వెలయు వీరవనితామతల్లి జీవితము పుణ్యమహిమవిలసితము.



# మూడవ కథ * లోపాముద్ర

## 1

లోపాముద్రాదేవి విదర్భదేశపు రాచబిడ్డ. సకలైశ్వర్యముల తోడను, సకల సద్గుణముల తోడను నలరు నాకన్య తన మంచి నడవడిచే తల్లిదండ్రులనేగాక చూచువారందఱను గూడ నానందపఱచుచుండెను. ఆ బాల మిక్కిలి యదృష్టవంతురాలనియు, లోక విఖ్యాతస్త్రీ యగుననియు నందఱును నాసించుచుండిరి.

ఇట్లుండ నొక దినమున నా రాజమందిరమునకు అగస్త్యమహర్షి వేంచేసెను. ఆయనను రాజాహ్వానించి యర్ఘ్యపాద్యాద్యనేకసత్క్రియలతో గౌరవించెను. "ఆర్యా! తమ రాకకు గారణమేమో తెల్పిన సత్వరము నెఱవేర్చెదను" అనియెను. అందులకు అగస్త్యుడు "రాజా! నేనొక కార్యమునుగూర్చి యిచ్చటికి వచ్చితిని. తప్పక నెఱవేర్చెదనన్నచో విన్నవించెదను" అని ప్రత్యుత్తర మిచ్చెను. "ఇంక నుపేక్షయా? తమబోటి ఋషిశ్రేష్ఠుల కోర్కెల నెఱవేర్చుట మా విధియై యున్నదికదా? తప్పక చేసెదను, సెలవిండు" అని రాజు ధైర్యముతోం బలుక అగస్త్యుడు ఇట్లనెను. "రాజా! నే నవివాహితుడను. పుత్రులు లేనివాడ నగుటచే "అపుత్రస్య గతిర్నాస్తి" అను నార్యవచనము ననుసరించి నా పితృదేవతలకు గతులు లేవు. కావున పెండ్లిచేసికొనవలెనని నా కిప్పుడు కుతూహలము కల్గినది. నీముద్దుబిడ్డ యగు లోపాముద్రను నాకిచ్చి పెండ్లి సేయుము."

రాజు నిశ్చేష్టితు డయ్యెను. సుఖానందడోలికల నూగు తన బిడ్డ నా నిరుపేదయగువాని కిచ్చుటకంటె ఘోరమైనపని వేఱొండులేదని శంకించెను. రాజు క్రోధారుణనేత్రుడై, యిట్టి యసహ్యమైన యసం

దర్భవు కోర్కెను వెల్లడించిన అగస్త్యుని దూషింపసాగెను. అప్పుడు మంత్రులు వచ్చి దూషణ వలదని వారించిరి. "రాజా! అగస్త్యుడన్నచో సామాన్యుడు గాడు. ఇంద్రద్యుమ్నునివంటి భూపాలుని దనశాపప్రభావముచే నేనుగుగా జేసెను. పట్టుదలచే సముద్రపు నీటినంతయు మూడు గుటకలలో బీల్చివై చెను. మితిమీఱి యాకసము నంటి పెరుగుచు, సూర్యచంద్రుల త్రోవ నరికట్టగలిగిన వింధ్య పర్వతము గర్వమడంచెను. వానియందు విపరీతమగు తపఃప్రభావము గలదు. అట్టివాడు నీకు జామాత యగుటయే శుభప్రదము.కావున సంశయింపకుము" అని వారు హితవాక్యములను జెప్పిరి.

ఆ సమయమునందే, లోపాముద్ర రమణీయ వస్త్రభూషణాలంకృతయై, తండ్రికడకు వచ్చి, యాతడు విచారమున నుండుటకు గారణమరసి, "తండ్రీ! నీవు చింతించుటకుం బనిలేదు. అగస్త్యుని సంబంధముచే మన వంశము పునీతమగును. ఇది యంతయు దైవవిధానము. నేను అగస్త్యునే పరిణయమాడెదను. అతడు బీదవాడని యనుమానింపకుము. నేను కష్టపడుదు నేమో యని సంశయింపకుము. అగస్త్యుని తపోధనమే నా సంపత్తు. అతని ప్రభావమే నాకష్టములను బాపును. అతడే నాదైవము; నా సర్వము నాతడే" అని నిశ్చయముతో బల్కెను.

## 2

రాజునకుగూడ నాలోచన మారెను. అతనికి వేఱుమార్గము గోచరింపలేదు. కోమార్తెకూడ తన సమ్మతిని దెల్పెను. ఇంకను దాని నిచ్చగింపనిచో అగస్త్యునికి నాగ్రహము గల్గి, వంశము నంతను శపింప వచ్చునను భీతికూడ గలిగెను. అందుచే రాజు గత్యంతరములేక లోపాముద్రను అగస్త్యుని భార్యగ జేసెను.

అగస్త్యుడు చాల దినము లత్తవారింటనే గడపెను. అచ్చట నాతడు విందులు గుడుచుచు, విలాసముతో గాలయాపనము గావించు చుండెను. లోపాముద్రయును పరిణయ మైన దాది భర్తనే దైవముగ నెంచి, సకలోపచారములను స్వయముగ జేయుచు, నెప్పుడును నాతని మాట జవదాటక, భక్తిశ్రద్ధలతో మెలగుచుండెను.

ఇట్లుండ, నొకనాటి యుదయమున అగస్త్యుడు భార్యను బిలిచి "నా కిప్పుడే యాకలి యగుచున్నది. నాకు వలయు నన్ని పాలు తెచ్చి పెట్టెదవా? అని యడిగెను. ఆ ప్రశ్న వైఖరిని గమనించి లోపాముద్ర వింతజెంది, "నాథా! మీ కోరికకు నేనే పనిని జేయనందును? నన్నింతగా నడుగవలయునా?" అని భర్తను ప్రేమరసపూరితములగు నేత్రములతో జూచుచు లోనికి జని, కనకకలశమునిండ క్షీరములను దెచ్చి యాతని కిచ్చెను.

అగస్త్యు డా పాలను నత్యాసక్తితో ద్రాగెను. త్రాగినవెంటనే యా స్వర్ణకలశము పాలతో నిండియుండెను. ఆతడు మరల ద్రాగెను. కాని క్షీరము లెప్పటియట్ల నిండదొడగెను. ఆతడెన్నిమారులు త్రావినను కలశము క్షీరములతో నిండుచునే యుండెను. ఈ యక్షయమును గాంచి, అగస్త్యు డచ్చెరువొంది, భార్యయొక్క మహిమను గ్రహించి యామె నెంతయు గొనియాడెను.

# 3

ఇట్లు కొన్ని దివసములు సుఖముగ గడచిన పిదప, అగస్త్యునికి దన యాశ్రమమునకు బోవ బుద్ధి కలిగెను. అది భార్యకు ధెలియ జేయగా నామె "నేనును వచ్చెదను. మీ పాదసేవ లేనియెడల నేనొక్క క్షణమైన నుండనోపను" అనెను. ఆమెకూడ నారచీరలు కట్టి జడలు

ధరించి ఋషికాంతయై అగస్త్యునితో గూడ నాశ్రమవాసమునకు బయన మయ్యెను.

వా రాశ్రమము చేరి కాపురము జేయుచున్న కొంత కాలమునకు అగస్త్యుని యనుగ్రహమువలన లోపాముద్ర యొక సుపుత్రుని గనెను. తనయుడు జన్మించిన సందర్భమున అగస్త్యుడు పుత్రోత్సవమును జేయ సంకల్పించుకొని, పెక్కురు ఋషులను విందున కాహ్వానము చేసెను. ఆహ్వానింపబడిన ఋషులు వచ్చు వఱకును లోపాముద్ర కా విషయము తెలియదు.

ఇంట భోజన పదార్థములు సమృద్ధిగ లేవు. అతిథిదేవత లగు మునులు వచ్చి యాశ్రమమున నుండిరి. మహాసందిగ్ధ సమయము; విపరీతమైన పరీక్షావిధానము. అయినను లోపాముద్ర యధైర్యము నొందలేదు. ఆమె యీశ్వరుని స్తుతించి, భర్తను స్మరించెను. వెంటనే వంటశాలంతయు మధుర భోజన పదార్థములతో బ్రకాశించెను. అతిథులు షడ్రసోపేతముగ భుజించి బాలుని యాశీర్వదించి మరలిపోయిరి. భార్య యొక్క యసమాన పుణ్యమహిమకు అగస్త్యుడు స్తంభీభూతుడయ్యెను.

మఱికొంత కాలము జరిగిన పిదప యొక దినమున విపుల మహాముని సతీసమేతుడై వీరి యాశ్రమమునకు విచ్చేసెను. అగస్త్యుడును, లోపాముద్రయు, వారిని సగౌరవముగ నాహ్వానించి మర్యాదలు జేసిరి. భోజనానంతరము మాటల సందర్భమున విపులమహాఋషిభార్య లోపాముద్రతో "దేవీ, నీ కెందులకు వచ్చినదమ్మా! మావంటి వారుండ నేయున్నారు. మహారాజు తనయవై యతులితైశ్వర్యములతో దులదూగెడి నీ కీ దురవస్థ యేటికి? ఒక్క యాభరణమైనను లేక యిట్లేల శ్రమపడెదవు?" అని యడిగెను.

అందులకు లోపాముద్ర నవ్వుచు "ఏమమ్మా! అన్నియు దెలిసిన దానవు, నీవుగూడ నిట్లే మాటాడుచున్నావు? ఇప్పుడు నాకు గల్గిన లోపమేమున్నది? నిజముగ నావంటి యదృష్టవంతురా లుండుట యరుదు. నా యాభరణములు చూడ గోరెదవేని యవిగో" అని తన వ్రేలినొక బాదముచెట్టు వైపునకు జూపెను. ముని భార్య యా చెట్టు వంక జూచునరికి, నా వృక్షమంతయు విలువగల సువర్ణాభరణములతో మెఱసిపోవుచుండెను. అప్పు డామె యాశ్చర్యమునకు నంతులేదు. అగస్త్యుడును, విపులుడును గూడ విస్మయపడిరి.

లోపాముద్ర పాతివ్రత్యమాహాత్మ్యమునకును, పుణ్యమహిమకును నందరును నత్యద్భుతమనస్కులై యెంతయు నభినందించిరి.

రాచబిడ్డయయ్యు, నాభరణములు మొదలైన నాడంబరములను నిరసించి, సతికి పతికంటె వేఱుభూషణము లేదని సూచించి, లోపాముద్ర తన జీవితమును పావనముగ జేసికొని పుణ్యస్త్రీలలో మేటియై విలసిల్లెను.

మనోనాథుని ప్రాణాధికునిగ నెంచి సేవించు భాగ్యవతి పవిత్రాంగన.

# నాలుగవ కథ: ⁂ చంద్రవదనా దేవి.

## 1

ఆ కాలమున కాశ్మీర దేశమునకు చంద్రశేఖరుడు చక్రవర్తి. సకలైశ్వర్య సద్గుణ సంపన్నుడైన యా భూపాలునికి చంద్రవదనాదేవి యను గారాబు కొమార్తె యుండెను. సమస్త సౌఖ్యములతోడ నలరారుచు, నా బాలిక దినదినాభివృద్ధి గాంచుచు, గురుదేవునివద్ద శ్రద్ధాభక్తులతో విశేష విద్యాపాండిత్యమును సంపాదించుచుండెను. సమస్త శాస్త్రముల నవలీలగ కంఠగతముచేసికొని, ముఖ్యాంశములను వానితో తర్కించుచుండెడిది. ఇదియునుగాక పూర్వజన్మపుణ్యావశమున నామెకు నీశ్వరజ్ఞానము మెండుగ నుండెను. జీవితమందు దుఃఖమునకు గారణము సంసారమే యనియు, నట్టిదానిని జవిచూడ కుండినచో నెట్టి బాధలు గాని యుండవనియు నామె విశ్వాసము. కనుక సంసారసాగర తీరమున చంద్రవదన విహరించ దలచుకొనలేదు.

ఆ దృఢసంకల్పము తన కొక్కతెకే వర్తింపజేసికొనలేదు. రాణివాసమందలి దాసదాసీజనమును జేరదీసి, వారలకుగూడ సంసార కష్టములను వెల్లడించి, వైరాగ్యమార్గమును బోధించెడిది.

ఇదియంతయు నామె తండ్రికి మితిలేని యావేదన కల్గించెను. తన ముద్దుకొమరిత యీ విధముగ విరక్తిమార్గమును ద్రొక్కుట యేమి కర్మము? కొమార్తెకి కను విద్యలను నేర్పించి, మఱియు సుఖానందడోలికల నూగించి, యే చక్కని రాజకుమారునో యల్లునిగ జేసికొనుటకు తా నువ్విళ్లూరుచుండెనే! చంద్రవదన ప్రవర్తనము రాజును హతాశునిగ జేసివేచెను.

ఇట్లుండ, రాజమందిరమునకు దివ్యజ్ఞాన సంపన్నుడైన భృగు మహర్షి యతిథిగ విచ్చేసెను. ఋషిభక్తుడగు చంద్రశేఖరుడు వానిని సవినయముగ నాహ్వానించి యాతిథ్యము నిచ్చెను. తరువాత భృగు మహాముని విరాగిని యగు చంద్రవదనతో మాటలాడుచుండ, నామె కొక యుద్దేశము కలిగెను. ఆ తపోధనుని యాశీర్వాదఫలము నంద గోరి "ఋషిపుంగవా! స్త్రీలకు దేనివలన కైవల్యప్రాప్తి కల్గునో చెప్పి నన్నుఁ గృతార్థురాలను జేయుడు" అని వేడుకొనెను. భృగుమహర్షియు నామె కోర్కెను దెలిసికొని యానందభరితుడై "దేవీ, నీకీ పిన్న వయస్సునందే యిట్టి యోచన కల్గుట శుభదాయకము స్త్రీలకు మోక్షము సంభవించుట భర్తమూలముననే. సతికి పతిని మించిన దైవము లేదు. భర్తనే దైవముగ నమ్మి పూజించు భార్యకు సకలా భీష్టములును నెఱవేఱి స్వర్గపదవి లభించును" అని నుడివెను.

ఈ యుపదేశము చెవికి సోకినంతనే చంద్రవదన యభిప్రాయ ములు మార్పుచెంద మొదలిడెను. ఇంతదనుకను సంసారమనిన వెఱపు జెందిన యామె కిప్పుడు సంసారముపై వ్యామోహము కల్గెను. పెండ్లి చేసికొని నిత్యసత్యకర్మానుష్ఠానములయందు భర్తకు దోడు నీడయై మోక్షము బడయనెంచెను.

## 2

ఈమార్పు కనిపెట్టి తండ్రి యామెకడకు వచ్చి "చిట్టి తల్లీ! నీకు వివాహతరుణమువచ్చి చాల కాలమైనది. ఇంతవఱకును పెండ్లి చేసికొనక పోవుట యుక్తముకాదు. కావున నాలోచించి చెప్పుము" అనియెను. అందులకు సిద్ధపడియేయున్న చంద్రవదన ముసిముసినగవు లతో "తండ్రీ! నీవు చెప్పిన మాటలకు నేను కాదనలేను. కాని

నాకొక్క నియమమున్నది. "స్త్రీ యెవరివలన పుణ్యపదవిని బొందును? స్త్రీకి భూషణమెయ్యది? మానవు లెట్టి కర్మలచే ముక్తి నొందుదురు? ఈ ప్రశ్నత్రయమునకు నెవరు సరియైన ప్రత్యుత్తరము నిత్తురో యా మహనీయునే వివాహమాడెదను'' అని చెప్పెను. రాజందుల కంగీకరించి, యా ప్రశ్నల ననేక రాజకుమారుల కంపెను.

ఎందఱో ప్రత్యుత్తరముల నంపిరి. కాని యందొకటియు నామెకు నచ్చలేదు. తుదిలేఖ యాంధ్రదేశరాజకుమారుడగు వింధాఖ్యునిది. "స్త్రీ భర్తమూలముననే పుణ్యపదవిని బొందును. స్త్రీకి మానమే భూషణము. మానవులు ఫలాపేక్షలేని కర్మలచే ముక్తి నొందుదురు" అని యా జాబునం దుండెను.

ఆ రాకుమారుని విజ్ఞాన సంపత్తికి చంద్రవదన సంతోషిత హృదయయై, వానినే వివాహ మాడుదు నని తండ్రికి దెలియజేసెను. అందుల కాతడించుక ఖిన్నుడై "బిడ్డా! వింధాఖ్యుడు వివాహితు డని తెలియవచ్చినది. పాంచాలకన్యకయైన చిత్రాంగదను పెండ్లియాడినవాడట. అట్టివానిని నీవు వరించుట సమంజసము కాదుగదా!" అనియెను. కాని యామె వెనుదీయలేదు. "ఆ సంగతి ముందుగనే మనము తెలిసికొనక పోవుట వాని తప్పిదము కానేరదు. కనుక ననినమాటను నిర్వహించి తీరవలయును. తప్పక వానినే పరిణయమాడెదను" అని యామె ప్రౌఢముగ బల్కెను.

చంద్రశేఖరునకు వేఱు మార్గము లేకపోయెను. ఏవిధముగనైనను కొమార్తె సుఖపడిన చాలునని తలంచి వింధాఖ్యునికి శుభవార్త నంపెను. సహజసౌందర్యముతో నలరారు కాశ్మీర నగరము చిత్రకారులచే మఱింత శోభాయమానముగ నలంకరింపబడెను. ఎటు జూచి

నను రాజమందిరము స్వర్ణకాంతులతో ప్రకాశించుచుండెను. ఎవరి ముఖమున జూచినను నానందమే ప్రతిబింబితమగుచుండెను.

శుభలగ్నమున చంద్రవదనా విందాఖ్యులు భార్యా భర్తలైరి. అప్పటినుండియు భర్తయెడ చంద్రవదనాదేవి చూపెడి భక్తి శ్రద్ధలను వర్ణింప నలవిగాదు. ఆయన ప్రథమభార్యయగు చిత్రాంగదను మించి యెల్లప్పుడును భర్తచెంతజేరి యాయన పాదపూజ సలుపుచు నాతని యాజ్ఞలను శిరసావహించి పతివర్తించుచుండెను.

# 3

విందుడు కొంతకాల మిట్టు లత్తవారింట విందులు గుడిచి భార్యలతో గూడ స్వస్థానమునకు బయనమయ్యెను. కొంతద వ్వరిగిన పిదప చీకటి పడుటచే వారొక యరణ్యసమీపమున నొకచో విశ్రమించిరి. విశేషముగ బడలిక జెందియుండుటచే వారు వెంటనే గాఢనిద్ర జెందిరి.

పిండి యారబోసినటుల స్వచ్ఛమైన వెన్నెల నలుగడల వెలయుచుండెను. ఆ సుఖసమయమున దేవతా స్త్రీలగు రంభ, ఊర్వశి, తిలోత్తమ, ముువ్వురును నాకసమున విహరించుచుండిరి. వారికప్పుడు సుఖముగ నిద్రించుచున్న విందాఖ్యుడును, వాని భార్యలును గన్పించిరి. తళతళలాడుచు రెండవ చంద్రునివలె ప్రకాశించుచున్న విందాఖ్యుని జూచి వారు మోహించిరి. అంత వారు మెల్లనవచ్చి విందాఖ్యుని నపహరించి తమ దేవలోకమునకు గొంపోయిరి.

మఱుక్షణముననే చంద్రవదనాచిత్రాంగదలు మేల్కాంచిరి. ప్రియభర్త చెంత లేకుండుట కని ఖిన్నవదనలై నలుదిక్కుల వెదకి వేసారిరి. ఆ యర్ధరాత్రమున వారికి దైవముసైతము తోడ్పడకుండెను.

చేయునదేమియు గానక భర్తకొఱకు విలపించి విలపించి తుదకు వారే ధైర్యము తెచ్చుకొనిరి.

నలుదెసలకు దన పరిచారకుల నంపి వెదకించుటకై చిత్రాంగద స్వదేశమునకు వెడలెను. అట్లు పోవుటకు చంద్రవదనాదేవికి మనస్సు సమ్మతింపలేదు. భర్త తన్ను విడిచిపెట్టిన స్థలముననే యామె కూర్చుండి తన సహజజ్ఞానసంపత్తిచేఁ దపము సేయ మొదలిడెను. పతివ్రతల దీక్ష యమోఘము. వారి మహత్తు నిరుపమానము. చంద్రవదనాదేవి తపఃప్రభావము గొప్ప జ్వాలయై దేవతాలోకమును ముట్టడించెను. దేవత లీ జ్వాలలఁ జూచి భీతిజెంది కారణము దెలిసికొనిరి.

దేవతలప్పుడు రంభోర్వశీ తిలోత్తమలను రప్పించి మందలించిరి. అప్పుడా ముగ్గురును దమ యకార్యకరణమునకు జింతించి, చంద్రవదన యొక్క పతిభక్తికిని, పుణ్యమహిమకును నచ్చెరువొంది, విందాఖ్యుని నామెకు దిరుగ నర్పించిరి. భార్యాభర్తలు తమ యెడబాటుచే గల్గిన యావేదనను మఱచి యానందపడిరి. చిత్రాంగదయు సవతియొక్క మాహాత్మ్యమును, నద్భుత ప్రభావమును గొనియాడెను.

తరువాత ననేకవత్సరములు విందాఖ్యుడు రాజ్యము నేలెను. చంద్రవదన తీరని భక్తిశ్రద్ధలతో, నెడతెగక భర్తపాదారవిందములను సేవించుచు, దాను బాల్యమున నిరసించిన సంసారసాగరమునుండియే మోక్షపదవికి మార్గము నిర్మించుకొనగలిగి, పుణ్యస్త్రీయై విలసిల్లెను.

స్వధర్మానుష్ఠానమున నీప్సితార్థ సిద్ధిని బడయు శీలవతి మానినీ తిలకము.

# అయిదవ కథ: ⁂ సక్కుబాయి.

## 1

హిందూదేశమున గణుతికెక్కిన పుణ్యక్షేత్రములలో పండరిపుర మొకటి. ఆనందతన్మయుడగు పాండురంగస్వామి నివాసస్థాన మీ పండరిపురము. ప్రతి సంవత్సరమును పెక్కువేలమంది భక్తులు, భక్తురాండ్రు, వివిధప్రాంతముల నుండి యాత్రార్థమై యచ్చటికి పోవుదురు. కీర్తనలతోడను, భజనలతోడను పండరిపుర మెల్లప్పుడును ప్రతిధ్వనించుచు నానందదాయకముగ నుండును.

అట్టి పవిత్రస్థానమున బూర్వ మొకప్పుడు దయామయుడగు నొక విప్రోత్తము డుండెను. సకలశాస్త్రపారంగతుడును, నిష్ఠాగరిష్ఠుండును నైన యా పండితశ్రేష్ఠునకు సక్కుబాయి యను తనూజరత్న ముండెను. పుట్టిన నాటినుండియు నా బాలిక సుగుణ సంపన్నయై, యెల్లప్పుడును పాండురంగనామస్మరణచేయుటయం దాసక్తి కలిగి యుండెడిది. తండ్రియు, తదితర భక్తులును జేయు పూజా విధానమును నా బాల యతిజాగరూకతతో ననుసరించుచుండెడిది. దేవాలయమునకు వెడలినపుడే కాక యింట నున్నపుడుగూడ సక్కుబాయి శ్రీహరిస్తవము గావించుచు మోక్షమార్గము నన్వేషించుచుండెడిది.

కాలమిట్లు జరుగుచుండ సక్కుబాయికి పెండ్లివయస్సు వచ్చెను. తల్లిదండ్రు లామెకు బెండ్లిచేసి యొకరింటి కోడలినిగ జేయుటకు నువ్విళ్ళూరుచుండిరి. కాని తమవంటి బీదవారి బాలిక నెవ్వరు వివాహము జేసికొందురా యని సంశయపడజొచ్చిరి. అయినను వరాన్వేషణము మానలేదు.

ఆ సందిగ్ధ సమయమున పండరిపురమున నొక బ్రాహ్మణ గృహస్థు

విచ్చేసెను. అతనిది కరవీర మను గ్రామము. ఆతనికొక పుత్రుడుండెను. వానికి పెండ్లిచేయవలయునను నుద్దేశముతో, నా బ్రాహ్మణుడు కన్యను విచారించుటకై బయలుదేరెను. తిరిగి తిరిగి యాత డీ పండరిపురమును జేరుకొనెను. ఆయూరి పెద్దలు కొందఱాతని యభిప్రాయమును దెలిసికొని సక్కుబాయి తండ్రివద్ద కాయనను దోడ్కొనిపోయిరి.

బ్రాహ్మణోత్తము లిర్వురును కలిసికొని, దైవకృతమగు వారి సమావేశమున కుప్పొంగిపోయిరి. సక్కుబాయిని కరవీరవాసి చూచి తనకు దగిన కోడలని గ్రహించి, తన నిశ్చయమును వెలిబుచ్చెను. సక్కుబాయి తండ్రియు నందులకు మిగుల సంతసము జెంది, తన సమ్మతమును దెల్పెను.

సాంప్రదాయసిద్ధముగ నొకనాటి శుభలగ్నమున సక్కుబాయికి పరిణయము జరిగెను. పాణిగ్రహణము జరిగిన కొలది కాలమునకు సక్కుబాయి యత్తవారింట భర్తతో గాపురము జేయబోయెను. అంతకు బూర్వమే తన జననీజనకులవద్ద సేవాధర్మములను నేర్చికొనిన యా గొనములప్రోగు, యత్తమామల యడుగులకు మడుగులొత్తుచు, భర్తయందతిశయానురాగముగలదై, వానినే దైవముగ బరిగణించుచు, నెవ్వరియాజ్ఞను మీఱక ప్రవర్తించుచుండెను. మఱియు, నామె యేపని జేయుచున్నను శ్రీహరిని మఱవక, నిశ్చలభక్తితో ధ్యానించుచుండెను. పాప మామె కొన్ని వేళలందు తన్మయత్వముచేత నింటికార్యములను గూడ మఱచిపోవుచుండెను.

ఇదంతయు జూచిన నామె యత్తమామలకు నెంతయు గంటకముగ నుండెడిది. ఆ బ్రాహ్మణుడు బాగుగ జదువుకొనినవాడైనను

నంత గుణవిశేషములు కలవాడు కాడు. లేనిచో నీశ్వరభక్తురాలగు నా సక్కుబాయిని బాధలు పెట్టుటెట్లు సంభవించును? ఏవియో కొన్ని శాస్త్రములను జదువుకొని, పొట్టకూటికై వృత్తి జేసికొని జీవించు వారిలో జేరిన హాడీ ద్విజుడు. ఏవిషయమునందుగాని యెక్కువపట్టింపు లేక, "ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కామాట"యని సరిపుచ్చుకొని పోయెడివాడు. అట్టివాడు సక్కుబాయిని పాండురంగనిస్మరణ మాని వైచి, యెల్లప్పుడును నింటి చాకిరియే చేయుచు, కాలము గడపుమని నిర్బంధింప మొదలు పెట్టెను. ఆమె యత్తయును నంతకంటె నెక్కుడుగ నదేపద్ధతి నవలంబించెను. భర్తయైనను సక్కుబాయి యందు గనికరము జూపకుండెను. వివేకహీనుడైన యాతడు, దయారస మెఱుగని యా తలిదండ్రులు తన భార్యను బెట్టు బాధలను నివారింప లేక పోయెను.

ఆనాటి కానాడు నిర్బంధ మెక్కువయ్యెను. సక్కుబాయికి ప్రాణములు విసిగిపోవుచుండెను. అయినను నామె యధైర్యము జెందక, భగవన్నామస్మరణామృతముచే దన ప్రాణములను బోషించుకొనుచుండెను.

ఇట్లుండ నొక దినమున సక్కుబాయి ప్రక్కయింటి స్నేహితురాలితో గూడ నీళ్లకై చెఱువునకు బోయెను. ఆ చెఱువుగట్టున పండరిపురమునకు బోవుచున్న కొందఱు భక్తులు భజన జేయుచు విశ్రమించిరి. వారిని జూచిన తోడనే సక్కుబాయికి ప్రాణములు లేచి వచ్చెను. వారితోగూడ పాండురంగని సేవింపబోవలయు నని యిచ్ఛ కలిగెను. అప్పు డామె ప్రక్కనున్న స్నేహితురాలితో "నేను వీరితో గూడ పండరిపురమునకు బోయెదను. నీ వీ సంగతి మా యత్తమామలకు దెలియజేయుము" అనెను. ఆ స్నేహితురా లటులనే చేసెను.

సక్కుబాయి యట్లు భజనపరులతో జేరిన సమాచారము విని, యామె యత్తమామలు మండిపడిరి. స్త్రీకిట్టి తెగింపు తగునా యని ప్రశ్నించిరి. వెంటనే వారుపోయి చెఱువు గట్టున నున్న సక్కుబాయి నింటికి లాగికొనివచ్చి, త్రాళ్లతో గట్టి యొక గదియం దుంచిరి. పాప మా భక్తురాలటుల దురవస్థ పాలయ్యెను.

## 3

భగవంతుడు ఆపద్బాంధవుడు, ఆపద్రక్షకుడు. తన్ను నమ్మి కొల్చువారిని మఱవడు. తమ సర్వస్వమును నీశ్వరపాదాంకితము జేసిన భక్తులకుగాని, భక్తురాండ్రకుగాని కష్టకాలమున నాయనయే శరణ్యము.

బంధితయైన సక్కుబాయి యేకాంతవాసమునందుగూడ భగవద్ధ్యానము నించుకయైన విడువలేదు. శ్రీహరికి జాలి కలిగెను. అప్పు డాయన భక్తురాలిని రక్షించుటకై వచ్చి, సక్కుబాయి కట్లను విప్పి, యామెను భజనపరులతో బంపి, తాను సక్కుబాయి రూపమున నా గదియందు బంధితుడై యుండెను. అద్భుతమైన యా దైవమహిమ నెవ్వఱును దెలిసికొనలేక పోయిరి.

విడుదలయైన సక్కుబాయి, ఆ యాత్రికులతో పండరిపురము జేరి, చాల దినము లెడతెగని యీశ్వరసేవ జేసి తుదకు కాలధర్మము నొందెను. ఆ యాత్రికులే యామెకు దహన సంస్కార క్రియలు జరిపిరి.

కరవీరగ్రామమందు మాయసక్కుబాయి పదిరోజు లన్నపానాదులు లేక యుండెను. పదునొకండవ దినమున నామె భర్తకు జాలికలిగి యామెకు వచ్చి కట్లను విప్పి, పోయి వంటజేయు మనెను. మాయసక్కుబాయి ఆ యాజ్ఞను శిరసావహించెను. అప్పటి నుండియు నామె యథాప్రకారముగ నింటికార్యములను నిర్వహించుచు కాలము గడపుచుండెను.

కరవీరపురమునఁ బరిస్థితు లిట్లుండ వైకుంఠమున లక్ష్మీదేవి శ్రీహరిని విడిచియుండలేకపోయెను. అందుచే నామె సక్కుబాయిని సజీవగ జేసి కరవీరపురమునకు బంపివైచెను. సక్కుబాయి తన గ్రామమున నున్న చెఱువుదగ్గఱకు జేరుసరికి యచ్చటికి నప్పుడే నీటికొఱకు వచ్చిన మాయసక్కుబాయి యామెకు నీటికడవ నందజేసి యదృశ్యయై పోయెను.

కడవనిండ నీరు నింపుకొని సక్కుబాయి తన యిల్లుజేరి యేమియు నెరుగనిదానివలె కాలము బుచ్చుచుండెను. తరువాత నొకనాడు భజనసేయుచు భక్తుడొకడు వారింటికివచ్చి, సక్కుబాయి యత్తమామలతో, బూర్వము సక్కుబాయి తమతో పండరిపురమునకు వచ్చుటయు, నచ్చట నామె చనిపోవుటయు మొదలుగాగల వృత్తాంతమునంతను జెప్పెను. వారదివిని విపరీతముగ విస్మయముజెందిరి.

నిజముగ సక్కుబాయియే చనిపోయినచో నిప్పుడు దమయింట నున్న సక్కుబాయి యెక్కడనుండి వచ్చె నని వితర్కించిరి. అంతయు నీశ్వరమహిమ యనియు, సక్కుబాయి యొక్క మాహాత్మ్యమనియు తుదకు దెలిసికొని వారామె పాదములపైబడి తాము తొల్లిచేసియున్న యపరాధముల నన్నిటిని క్షమింపుమని వేడుకొనిరి.

కాని నిర్మలభక్తురాలగు సక్కుబాయికి నిటువంటి వానితో నిమిత్తము లేదు. చిఱునగవుతో వారిని లేవదీసి శ్రీకృష్ణమంత్రము నుపదేశించి కృతార్థులను జేసెను. ఆమె పవిత్రజీవిత మెంతయు మహిళామండలికి నాదర్శనీయము.

నిర్మలమనస్కులగు భక్తులకు నీశ్వరు డెంతయేని దోడ్పడును.

---

# ఆఱవ కథ: * * * సంయుక్త

## 1

ఉత్తర హిందూస్థాన చరిత్రపథమందు, ఇంద్రధనుస్కాంతులతో మెఱయునట్టి వీరవనితలలో, సంయుక్త గణుతి కెక్కినది. నిష్కల్మష ప్రేమారాధనకేగాక, శౌర్యసాహసకార్యములకుగూడ నామె ఖ్యాతి వడసినది.

సంయుక్త కనోజి పట్టణప్రభువగు జయచంద్రుని మురిపెంపు గొమార్తె సౌందర్య దేవతా ప్రసాదితయో యనునట్లా బాలిక, యత్యద్భుత రూపరేఖా విలాసములు కలిగి, చిన్ననాటినుండియు జూపరుల నానంద పఱచుచుండెను. చక్కదనముతో బాటు నామెకు బుద్ధి వికాసముగూడ మెండు.

జయచంద్రుని పినతల్లి కొమారునిపేరు పృథ్వీరాజు. ఆ పృథ్వీరాజప్పుడు ఢిల్లీ సామ్రాట్. ఆత డసమాన బాహుపరాక్రమశాలి, విశేషకీర్త్యవిఖ్యాతి సంపన్నుడు. అందుచే నతడన్నచో జయచంద్రుడు కినుక వహించెను. ఇది యిట్లుండగా, వీరి తాత యగు ననంగపాలుడు చనిపోవుచు, దన రాజ్యమునంతను పృథ్వీరాజున కిచ్చెను. అంతకు మున్నే బలాఢ్యుడై యున్న పృథ్వీరాజు, క్రొత్తగా సంక్రమించిన యీ ప్రాభవముతో మఱింత ప్రాముఖ్యత సంపాదించెను. ఇదంతయు జూచి జయచంద్రుని కన్నులెఱ్ఱబడెను. అయ్యది సహజము. మానవ నైజము. అందుచే నీర్ష్యాన్వితుడైన జయచంద్రుడు వీలు చిక్కినపుడు పృథ్వీరాజు నవమానింప వేచియుండెను.

భూపాలుర బాంధవ్యము లిట్లుండ, సంయుక్త తన యేకాంత మందిరమున పృథ్వీరాజు యొక్క సౌందర్యార్చన జేయుచుండెను.

ఆమెకు ప్రాయము వచ్చి ప్రేమ యంకురించిన నాటినుండియు సంయుక్త శౌర్యమూర్తియగు పృథ్వీరాజును దన మనమునందు ప్రాణనాథునిగ భావించి, పూజించుచుండెను. తన యుద్దేశ మెవ్వరితోడను జెప్పక పోయినను, పృథ్వీరాజునే పరిణయ మాడవలె నను నుత్సాహముతో నువ్విళ్ళూరు చుండెడిది.

ఈమె సంగతి యిట్లుండ పృథ్వీరాజునందు జయచంద్రుని క్రోధ మధికమగు చుండెను. రాజసూయయాగము నొకదానిని జేసి, యందులకు పృథ్వీరాజును దక్క నందఱ నాహ్వానించినచో, నతనికి నగౌరవమే యగునని జయచంద్రు డూహించెను. ఆ యాగముతో బాటు సంయుక్త స్వయంవరముగూడ జరుపుటకు నిశ్చయము జేసికొనెను.

రాజకుమారులందఱకును శుభవార్త లంపబడెను. తనకు జరిగిన యమర్యాదను పృథ్వీరాజంతగ బాటింపక పోయినను, నాతని పౌరుషాగ్ని ప్రజ్వరిలక పోలేదు. యాగమును భంగము చేయుటకై, యాతడు జయచంద్రుని గోత్రీకు నొకనిని జంపించెను. అశుచి పోకుటచే నియమిత దినమున యాగము జేయ నవకాశము లేకపోయెను. సంకల్ప నిరోధము కల్గినందులకు జయచంద్రుడు మఱింత కుపితుడై, పంతమునకు స్వయంవరమును కొనసాగింప సమకట్టెను.

## 2

కనోజిపట్టణమంతయును, రాజమందిరమును, చిత్రచిత్రముగ, వివిధవిధముల నలంకరింపబడెను. సౌందర్యదేవత యచట దాండవ మాడుచున్నదా యను నటులుండెను. ఎక్కడెక్కడనుండియో యరుదెంచిన రాకుమారులకు దగిన విడుదు లేర్పాటు చేయుబడెను. సమస్త సౌకర్యములును సమర్చబడియెను.

శుభసమయమునకు వారందఱును తమ ఠీవిని వెలార్చు వస్త్రాలంకారములతో, స్వయంవర మందిరమున నాసీనులైరి. ఇదేసమయమనుకొని జయచంద్రుడు పృథ్వీరాజు విగ్రహము నొకదానిని మట్టితో జేయించి, స్వయంవర మందిర కవాటమున ద్వారపాలకునిగ నిలువబెట్టెను. నలుగురిలో నిట్లవమానించిన, పృథ్వీరాజునకు దగినశాస్తి జరుగునని యాతని తలంపు.

స్వయంవర ముహూర్తమునకు నిరువురు నెచ్చెలులు వెంటరాగ బంగరుబొమ్మయన దగు సంయుక్త మందగమనముతో వింత సోయగము వెలిబుచ్చుచు నా సభామందిరమునకు వచ్చెను. తల్లియు, దండ్రియు నామె నాశీర్వదించి "విచక్షణచేసి మంచిభర్తను కోరుకొనెదవు గాక!" యనిరి. చెలులామెను వెంటనిడుకొని యొక్కొక్క రాకొమరునే చూపుచు, వాని గుణగణనము సేయుచుండిరి- కాని వారి యందొక్కరినైనను సంయుక్త కన్నెత్తిచూడలేదు. అటుల చుట్టును దిరిగి నాను మందిరద్వారము చేరునరికి నెల్లరు నచ్చెరువంద ద్వారము కడ నుంపబడిన పృథ్వీరాజు విగ్రహమును సంయుక్త పుష్పమాలాలంకృతము గావించెను. స్వయంవరము పూర్తియయ్యెను.

విగ్రహము మాటున మాఱువేషమున డాగియున్న పృథ్వీరాజు ఆకస్మికముగ ముందునకు దుమికి తన శ్వేతాశ్వముపై సంయుక్తను గూడ నిడికొని యొక్క త్రుటిలో నదృశ్యుడయ్యెను.

ఇక సభ్యులలో గల్గిన కోలాహలమునకు పరిమితిలేదు. ఆనందోద్రేకమున నున్న వృషభములపై నాకస్మికముగ సింగము దుమికినట్లయ్యెను. "హాయె, హాయె" యను విషాదధ్వనులు చెలరేగ, నందఱును నసూయాక్రాంతచేతస్కులైరి. జయచంద్రుని కోపాగ్నికుండము లోని జ్వాల లెగయుచుండెను. కొమార్తె తన్నావిధముగ మోసపుచ్చి,

యట్టి సాహసకృత్యము జేసినందులకు మండిపడ జొచ్చెను. తా నవ మాన చిహ్నముగ నుంచిన విరోధియగు పృథ్వీరాజు విగ్రహకంఠమున పూదండ నిడినందులకే, జయచంద్రు డామెను జంపుటకు నిశ్చయించు కొనెను. ఈ పలాయనము జరిగిన తరువాత నాతడు పృథ్వీరాజునుగూడ పట్టుకొని నుఱుమాడ వలెనని తీవ్రశపథము బూనెను.

సంయుక్త నెత్తుకొని పృథ్వీరాజు కనోజి వెలుపల సిద్ధముగ దనరాకకు వేచియున్న యపార సైన్యమును జేరుకొనెను. అందఱును సమరమునకు సిద్ధముగ నుండిరి.

## 3

ఆట కనోజి లోపల జయచంద్రుడు క్షణకాలములో రణభేరీ మ్రోగించెను. వేలకొలది సైనికులు విచ్చుకత్తులతో ప్రత్యక్షమైరి. రాజ్యము వెలుపల గుడారములందు పోరునకు తయారుగనున్న ఢిల్లీ సైన్యమును చెండాడవలె నను మహాసంకల్పముతో బయల్వెడలిరి. తీవ్రాగ్రహానలజ్వాలలు నలువైపుల నెగయ వైరి సైన్య సమూహ ములు రెండును సంగ్రామమునకు దారితీసెను. మహోత్కృష్టమైన సమయమది. రణరంగమున వీరరక్తము కాలువలై ప్రవహించెను. కాని యిరువైపులగూడ నేరి పౌరుషము తగ్గలేదు. ఇక నాలసించిన లాభములేదని పృథ్వీరాజు "విజయమో, మరణమో' యని గర్జించుచు గొదమసింగమువోలె సమరమధ్యమున నుఱికెను.

కొంత తడవయ్యెను. సూర్యుడస్తాద్రిని గ్రుంకుచుండెను. ఇక నాదినమునకు యుద్ధ మాపుదల చేయవచ్చునని పృథ్వీరాజు తలంచు చుండెను. ఇంతలో నెక్కడనుండియో యొక గూఢవ్యక్తి వచ్చి రహ స్యముగ పృథ్వీశునిపై ఖడ్గమెత్తెను. కథానాయకున కింతకంటె దుర వస్థాసమయము లేదు.

గుడారమునుండి యిది యంతయు జూచుచుండిన సంయుక్తా దేవికి నొడలు గగుర్పొడిచెను. ఆపదవస్థ యందున్న తన మనోనాథుని రక్షించుటకై, రిపుని నామె పరువెత్తి చేయినెత్తిన యా ద్రోహిఖడ్గము నట్టులే లాగివైచెను. ఆర్తనాదముతో నాతఁ డులికిపడెను. పృథ్వీరాజున కంతయు విదితమయ్యెను. ముసుగువైచికొనియున్న తన ప్రాణరక్షకుని సరిగ గుర్తించలేక వానిపాదములపై బడబోయెను. సంయుక్త యది సహింపలేక ''నాథా''యని యాతని లేవనెత్తెను. ''నీవా!''యనుచు పృథ్వీరా జామెను కొనియాడ జొచ్చెను. పిమ్మట వారు గుడారమునకు బోయి వెన్నెల విలాసమున నానందించుచు సరసము లాడుకొనిరి.

యుద్ధము ముగిసినది. విజయలక్ష్మి పృథ్వీశుని పాలిట నృత్యము సల్పెను. ఢిల్లీసామ్రాజ్యమంతయు నానందతరంగడోలికల నూగు చుండెను. తన మనమునందు వరించిన భర్తయే లభించినందులకు, సంయుక్త యీశ్వరుని స్తుతించెను. ఆపదవస్థయందు దన ప్రాణమును రక్షించిన వీరరమణియగు సంయుక్తను, పృథ్వీశుడు శ్లాఘించెను. ఇట్లు వా రన్యోన్యప్రేమానుబంధములచే కట్టబడి కాలము గడపుచుండిరి.

## 4

కాని, కాలమెల్లపుడు నొకేరీతి నుండనోపదు. అదృష్టదేవత యెప్పుడు నొకనినే వరించియుండదు. పృథ్వీరాజు విషయలోలుడై, రాజ్యపాలనయం దశ్రద్ధవహించి యుండెను. అంతియకాక, తన సేనా పతులను, పరివారమును నిర్లక్ష్యముగ జూచుచు, వారియెడల నీచముగ బ్రవర్తించుచుండెను. ఇది వారికి కష్టము గలుగజేసెను. అంతకంతకు వారి కసహ్యత హెచ్చెను. అందుచే వారు పృథ్వీరాజునందు నసూయత గలిగి, వీలైనచో నతని వద్దనుండి వీడిపోవుటకు వేచియుండిరి.

ఇది యిట్లుండ, జయచంద్రుని పరాభవాగ్ని చల్లారలేదు. ఏవిధముగనైనను పృథ్వీరాజును నాశము చేయవలెనను నుద్దేశముతో, హిందూదేశమునకు పశ్చిమోత్తర సరిహద్దుల దాపుననున్న షాబుద్దీన్ గోరీ యను మహమ్మదీయ పాలకునితో జతగూడి, ఢిల్లీపై దండువెడలెను. ఇదే సమయ మనుకొని యచట ససంతృప్తి జెందినవారు వీరి పక్షము జేరిరి. అదివఱకే నీరసించియున్న ఢిల్లీ సింహ మిప్పుడు గంభీరగర్జనమైన జేయజాలక పోయెను.

స్థానేశ్వర క్షేత్రస్థానము యుద్ధభూమి. మైత్రీభావముతో మెలగుచున్న హిందూమహమ్మదీయ వాహినులు, ఢిల్లీసైన్యమును మొదటి దాడియందే చెల్లాచెదరు చేసెను. పృథ్వీరాజు దురదృష్టదేవతయొక్క యంకపీఠికపై నాక్రందనము జేసెను.

ఈ పరాజయవార్తను విని సంయుక్త అగ్నిగుండమును సిద్ధము చేయించెను. ప్రేమమయుడును, శౌర్యమూర్తియునైన తన భర్తను స్మరించి, పతివ్రతాధర్మము దప్పక, ప్రాణముకంటె మానమే స్త్రీకి ముఖ్యాభరణ మని తలంచి, యా యగ్నిజ్వాలలయందు నాహుతి యయ్యెను. ఆమె నావరించి భస్మీభూతము జేసిన జ్వాలారుణకాంతిచేతనే, నేటికిని సంయుక్తపవిత్రనామము, హిందూదేశేతిహాసము నందు ననిర్వాచ్యమగు తేజముతో బ్రకాశించుచున్నది.

పతిభక్తిపరాయణమై మనోవాక్కాయకర్మముల జీవిత సర్వస్వము నర్పించు కులస్త్రీ పవిత్రురాలు.

# ఏడవకథ: *** కుగ్లరు డాక్టరు:

## 1

కేవలము పారమార్థిక చింతనచే బురికొల్పబడి, పరదేశములనుండి మన మాతృభూమికి వచ్చి, మానవసేవాపరాయణతయందు మగ్నులై మహోపకారము లొనర్చిన పావనజీవు లగు పాశ్చాత్య స్త్రీ పురుషు లెందరో కలరు. విద్యావిషయములందు కొందఱు, మతవిషయము లందు కొందరు, వైద్యవిషయములందు కొందఱు, సాంఘిక విషయము లందు కొందఱు, చిత్రకళావిషయములందు కొందఱు, ఈ విధముగ వారి వారి యభిమానవృత్తులందు వారు కృషిచేయుటయేగాక, మన దేశీయుల కుత్సాహము పురికొల్పి యున్నతజీవితపథములందు ప్రవేశపెట్టిరి. అట్టి యుత్తమజీవులలో డాక్టరు కుగ్లరు దొరసాని యొకర్తుక.

మనకు దాదాపు పదివేల మైళ్ళ దూరమున నున్న అమెరికా దేశమందు జననమొంది, వైద్యవృత్తి నవలంబించి, యిచ్చటికి వచ్చి యేబది సంవత్సరములపాటు గుంటూరు పట్టణమున వైద్యురాలుగ నుండి, వేలకొలది జనులకు సాయము చేయుట యాంధ్రదేశము యొక్క ప్రత్యేకభాగ్యమే యని చెప్పవచ్చును. ఒక్క వైద్యసహాయముచేతనే గాక తన సౌహార్దము చేతను, సామరస్యము చేతను నామె యాంధ్రుల హృదయముల నాకర్షింప గలిగినది. ఆంధ్రదేశమందామె పేరు వ్యాపింపని గ్రామము లేదన్నను నామె నామమును వినని వ్యక్తు లుండరన్నన నతిశయోక్తి కాదు. మద్రాసునందు డాక్టరు మిల్లరును, మచిలీబందర నందు నోబుల్ దొరయును, విద్యావిషయములం దిట్టి ఖ్యాతినే సంపాదించి నేటికిని స్మరింపబడుచున్నారు.

## 2

అమెరికాయందలి పెన్సిల్వేనియా రాష్ట్రమున అథెన్సువిల్లా అను గ్రామమున 1856 వ సంవత్సరము ఏప్రియల్ 19 వ తేదీన ఈ అన్నా కుగ్లరుకాంత జనించినది- ఆమె తండ్రియగు చార్లెసును తల్లియగు హారియటును మతవిషయములందే పనిచేయుచు దైవభక్తులనియు, సత్యాన్వేషులనియు ప్రతీతి బడసిరి. అట్టి సద్వంశమున నుద్భవించిన కుగ్లరుకన్య యన్యథా యెట్లుండగలదు? చిన్ననాటనుండియు నామె మనస్సు ఆధ్యాత్మిక విషయములందే విహరించుచు పారమార్థిక సేవా చింత యొనరించుచుండెను.

అందుచే నామె యా ధర్మసిద్ధి కనుగుణ్యముగ నున్నటువంటి యున్నతవైద్యవిద్య నభ్యసించి, 1879 లో పట్టభద్రురాలయ్యెను. పిదప నామె యచ్చటనే 'నారిసు' పట్టణమున ఉన్మాద వైద్యశాల యందు సహాయవైద్యాధికారిణిగ రెండు వత్సరములు పనిచేసి, తోడి సోదరసోదరీమణులకు నిష్కళంకమైన సేవ సలిపెను.

కాని యామె యట్టి స్వల్ప సేవతో దృప్తిబొందక, ఇంకను నెక్కువ మందికి సహాయముచేయ గుతూహల పడుచుండెను. ఆ సమయముననే హిందూదేశమందలి "మహిళాసంఘము" వారు "ఇక్కడికి వచ్చి గుంటూరు మిషను పాఠశాలయందుపాధ్యాయినిగ బనిజేయు" మని కుగ్లరుకాంత కాహ్వాన మంపిరి. అయ్యది కేవల మీశ్వర సందేశమే యని యామె భావించి, యా యవకాశము నత్యంతాహ్లాదముతో స్వీకరించెను. హిందూదేశమునకు బోయి, యచ్చటి ప్రజలకు విద్యావిషయము లందును, వైద్యవిషయము లందునుగూడ సహాయభూతురాలుగ నుండు భాగ్యము గల్గినదికదా యని యామె యువ్విళ్లూరినది.

# 3

అంతట నామె తల్లిదండ్రుల యొద్దను, సోదరీసోదరుల యొద్దను సెలవు గైకొని, 1883 ఆగష్టు మాసమున అమెరికానుండి ప్రయాణమై అక్టోబరు నెలలో గుంటూరు చేరుకొనెను. అచ్చట నదివరకే యున్న డాక్టరు ఊహిల్ మొదలగు పాశ్చాత్యు లామె నాహ్వానించి గౌరవించిరి. అప్పటినుండియు అన్నా కుగ్లరు వైద్యవృత్తిని గూడ నవలంబించి పౌరులకు వైద్యసహాయము చేయ ప్రారంభించెను. ప్రప్రథమమున నామె కంతయెక్కుడుగ జయము కలుగకపోయినను నామె జంకులేక కలిగిన స్వల్పపరికరములతోడనే రోగులకు చికిత్స చేసి సాయము జేయుచుండెను.

ఒక చిన్నయింటిలో నామె వైద్యశాలయంతయు నమరియుండెను. కాని యామెయొక్క వైద్యసహాయమును బొందిన యెల్లరును నామెయొక్క యమృతహస్తమున కచ్చెరువొందుచు తమ యదృష్టమున కుప్పొంగిపోయెడివారు. అందును నామె స్త్రీల వ్యాధులం దెక్కువగ కృషిచేసి వాని నివారణోపాయములందు నిపుణత జూపెడిది. ఆ దినములలో వైద్యశాలలే తక్కువ. అందును స్త్రీలకు ప్రత్యేక వైద్యాలయములు మిక్కిలి యరుదు. అట్టితరి కుగ్లరు దొరసాని వైద్యాలయ మెందఱు స్త్రీలకో శరణాలయమైనది.

అప్పటినుండియు నావైద్యశాల దినదినాభివృద్ధిచెంది యాంధ్ర దేశములోని నేటి వైద్యాలయములలో నగ్రగణ్యత గాంచినది. దీనికి గారణము కుగ్లరు కాంతయే. తన జీవితాదర్శమైన మానవసేవ కత్యంతావకాశము నిచ్చెడి యీ వైద్యాలయమును నామె తన కుమార్తెవోలె దిలకించుచు నభివృద్ధికి దెచ్చెను. ఆ సంస్థ మిషనువారి ధనసహా

యముచే బోషింపబడి కుగ్లరు దొరసాని యొక్క యాత్మప్రతిభచే నభివృద్ధి గాంచినది. ఆమె యేయేబది సంవత్సరములలో నాసంస్థను నాదరించియుండనిచో దాని పెంపెట్లుండెడిదో యూహింపజాలము. కాని కుగ్లరు గుంటూరు వైద్యాలయముయొక్క యాత్మయై వెలసెనన్నచో నతిశయోక్తి కానేరదు. లేనిచో నావైద్యాలయముయొక్క పేరు మాటుపడి పోయి "కుగ్లరు ఆస్పత్రి" యని వఱలుటకు గారణమేమి? ఏసంస్థ యభివృద్ధియైనను సాధారణముగ నొక వ్యక్తియొక్క సాధన సంపత్తిపై నాధారపడియుండును. అవ్యక్తియొక్క యాత్మబలమే సంస్థయొక్క యవయవవికాసమునకు హేతుభూతమై యుండును.

## 4

కుగ్లరు డాక్టరు యొక్క యపారవిఖ్యాతియు, విపరీత వశీకరణ శక్తియు నామె పాండితీప్రకర్షపైననేగాక, ముఖ్యముగ నామె కార్యనిరతిపైనను, కృపారసముపైనను, సౌశీల్యము పైనను, సమ్యక్ళంకాదరణానురాగములపైనను నాధారపడియున్నవి. ప్రజాసేవయే పరమావధిగ భావించినది యామె. అందును నస్వస్థులగువారికి సేవజేయుట మహాభాగ్యము. అట్టివారిని దన చల్లని మాటలచేతనే సమస్త బాధలను మఱచి పోవునట్లుల జేసెడిది. అట్టి యపారమైన యవ్యాజానురాగమును, ప్రేమను జూపెడి కుగ్లరుకాంత, "పెద్దమ్మ" యనెడి గౌరవ బిరుదమును బొందిన దన్నచో వింతకాదు.

ఈపైన విశదీకరింపబడిన సుగుణములే కుగ్లరు డాక్టరుయొక్క జీవిత సారాంశమును, మహిమరహస్యమును, వేనోళ్ల వెల్లడించుచున్నవి. జాతిమత వర్ణవివక్షత లేక, మానవసేవయందే మగ్నురాలై,

ముఖ్యముగ మన యాంధ్రదేశ స్త్రీజనాళికి కొంగుబంగారై వెలసిన, యీ పాశ్చాత్యస్త్రీనామము మనకు సదా స్మరణీయ మగుటలో విశేష మేమి! ఆమె యొక్క కార్యోత్సాహముతో నెలకొల్పబడి, పోషింపబడిన యావైద్యాలయము ఇంకను చిరస్థాయిగ చేయ సిద్ధపడుచుండగా నామె విధివశమున 1930 వ సంవత్సరము, జూలై 26 వ తేదీన పరమపదించి నది. ఆమె చేసిన సేవయే, యామె నెలకొల్పిన వైద్యాలయమే కుగ్లరు డాక్టరుయొక్క స్మారకచిహ్నములుగా నాంధ్రదేశమందు వెలయు చున్నది.

## ఎనిమిదవ కథ: *** చానమ్మ.

## 1

బ్రాహ్మణవంశ ప్రభూతుడైనను, నఖండక్షాత్ర తేజోవిలసితుడై "ఖడ్గతిక్కన'', "రణతిక్కన" యని ప్రజాదరణము బడసి, శూర శిఖామణియని గణుతికెక్కిన తిక్కన వీరుని సహధర్మచారిణి—చానమ్మ. అట్టి వీరవరేణ్యుని యర్ధాంగియై, భర్తకు దీసిపోని ధైర్యసాహసములు గలిగి, వాని కన్నివేళ లందును దోడునీడయై మెలగి, తుదకు వాని వీరస్వర్గప్రాప్తికి కారకురాలుగూడ నైన చానమ్మ యాంధ్రవీరాంగనా శ్రేణియందు బ్రాముఖ్యస్థాన మలంకరించి యున్నది.

ఖడ్గతిక్కన, యాంధ్రభారత గ్రంథరచయిత యగు కవి తిక్కన యొక్క పినతండ్రి కుమారుడు. బ్రాహ్మణవంశజుడగుటచే నప్పటి నెల్లూరుప్రభువగు మనుమసిద్ధిరాజునకు దండనాయకుడుగ నుండి శ్రద్ధతో మెలగుచుండెడివాడు. తిక్కన యుద్ధభూమియందేగాక రాజ్య కార్యములయందుగూడ దన శక్తిసామర్థ్యములను వెల్లడించుచుండెడి వాడు.

ఒకానొకప్పుడు మనుమసిద్ధి రాజునకును, యాదవభూపాలు డగు కాటమరాజునకును యుద్ధము సంభవించెను. శత్రుసేనల నెదు ర్కొనుటకై మనుమసిద్ధి రాజు తిక్కనను నియమించెను. తిక్కన ఖడ్గ మును మెఱపించుచు వేలకొలది యోధులతో రణభూమికి బయల్వెడ లెను.

కాటమరాజు సైన్యముగూడ నపారము. మనుమసిద్ధి రాజు నోడించి పరాభవింపవలెనని వాని తలంపు.

ఇరువైపుల వారును సమరమునకు దిగిరి. ఘోరముగ పోరు

జరగెను. యాదవశూరుల యత్యద్భుత పరాక్రమమును తిక్కన సైనికు లెదుర్కొన జాలరైరి. పోరు హెచ్చిన కొలదియు రణరంగమున నిలువజాలక వారు పాఱిపోజొచ్చిరి. తుదకు తిక్కన, యేకాకియై నిలచెను. ఇక చేయగల్గినదేమి? తిరిగి తన సైన్యమును జేకూర్చి కొని వచ్చు తలంపుతో తిక్కనకూడ మఱలివచ్చెను.

## 2

పోరు ముగియకయే తిక్కన పురమున ప్రవేశించుట జూచి పౌరులు నిస్పృహావాక్యము లాడిరి. గృహము జొచ్చి స్నాన మాడ బోవ చానమ్మ పసుపుటుండ నందిచ్చెను. విస్మయచిత్తుడై "ఇదేమి" అని తిక్కన యడుగ "వైరులకు వెన్నిచ్చి పాఱివచ్చిన మీకును ఆడువాండ్రకును భేదమేమి!" అని యామె కఠినముగ బల్కెను. స్నానానంతరము భోజనము చేయుచుండగా వాని తల్లి ప్రోలమాంబ విఱిగిపోయిన పాలు పోసెను. "ఇదేమి" యని తిక్కన ప్రశ్నింప తల్లి "నాయనా, శత్రువులను జూచి భీతిజెందిన వీరున కింతకంటె నెక్కుడు కావలెనా!" యని పరిహసించెను. అప్పుడు చానమ్మ యా మాటపై "నాథా! యేల యిట్లు సమరభూమినుండి మఱలివచ్చితిరి? మీ యనుచరులు పాఱిపోయిన పోయిరి గాక. యుద్ధభూమిని వైరుల జయించుటయో, ప్రాణముల గోల్పోవుటయో వీరధర్మమైయుండ, మీరిట్లు వైరులకు వెన్నిచ్చివచ్చుట యేటి పౌరుషము! మీ బిరుదుల గౌరవమేమయ్యెను? వంశానుగతమగు మీ శూరత్వమంతయు నంతరించెనా? మీ వంశమునకును, మీ రాజ్యమునకును, శాశ్వతమగు నపకీర్తి వాటిల్ల లేదా? నలుగురిలో దలయెత్తి తిరుగుటెట్లు? అని పోల్లుంఠనవాక్యములను బల్కెను. తిక్కన యా కఱకుమాటల యావేదనమును భరింప

జాలకపోయెను. తాను గావించిన పొరబాటును గ్రహించి వెంటనే యుద్ధమునకు బర్విడెను. ఇప్పు డాతని ఖడ్గధాటి కడ్డులేదు. ఎందఱో శత్రువులు బలియైరి. కాని తుదకు తిక్కన శూరుడే నిహతుడయ్యెను. అల్లు వీరోచిత ధర్మమును నెఱపి యస్తమించిన తిక్కనతార వీరస్వర్గ వియత్తలమం దరుణకాంతులతో విరాజిల్లెను.

అట్టి వీరపురుషుని ధర్మపత్నియగు చానమ్మ ధన్యజీవిని, పుణ్యస్త్రీ. తిక్కన యుద్ధమునుండి మఱలివచ్చినప్పు డామె గావించిన వీరప్రబోధమే వానిని శాశ్వతవీరస్వర్గ మలంకరింపజేసెను. ఆమె యట్లు చేయనిచో తిక్కన వీరస్వర్గము జూఱగొని వీరమణియై విరాజిల్లెడివాడుకాదు. తన యుద్బోధచే భర్తకు పుణ్యపదవిని జేకూర్ప గలిగిన చానమ్మ పుణ్యస్త్రీయేకదా! యుద్ధమునకు బోయినచో తిక్కన మరణించునని యామెకు దెలియును. కాని యటుల జరగినచో వానికి వీరస్వర్గము ప్రాప్తించుననిగూడ దెలియును. అందుచే, తిక్కనకు వీరధర్మమును జ్ఞప్తికిదెచ్చి వానిని వీరశిఖామణిగ జేసిన చానమ్మ యెల్ల కాలములకును స్మరింపదగినది.

ధైర్యము గోల్పోయిన భర్తను కార్యశూరునిగ నొనర్పగలిగిన సతీలలామ జీవితమే జీవితము.

రెండవ భాగము.

# ఒకటవ కథ: * * * తరిగొండ వెంగమాంబ.

## 1

పరిఖ్యాతాంధ్రకవయిత్రులలో తరిగొండ వెంగమాంబ యొకతె. తరికుండ వెంకమ్మయని కూడ నామె వ్యవహరింపబడు చున్నది. మొల్లవలెనే వెంగమాంబయు కవయిత్రియై నేటికిని స్మరింప బడుచున్నది. ఆమె రచించిన గ్రంథములు; అందు ముఖ్యముగ "వేంకటాచల మాహాత్మ్యము" "ముక్తికాంతా విలాసము" ఇప్ప టికిని నభిలాషతో బఠింపబడుచున్నవి.

వెంగమాంబ జన్మస్థానము కడపజిల్లాలోని తరిగొండగ్రామము. ఒకానొకప్పు డా ప్రాంతపు ప్రజలను కాటకమునుండి రక్షించుటకై శ్రీలక్ష్మీనృసింహాస్వామి వెలసిన పవిత్రస్థల మది. వెంగమాంబ తండ్రి కృష్ణయ్య యను సద్బ్రాహ్మణుడు. లేక లేక లభించిన వెంగమాంబ నత డత్యంత ప్రేమాతిశయములతో బెంచుచుండెను. ఆమె పిన్ననాట నుండియు పాపభీతి గలిగి సత్ప్రవర్తనతో మెలగుచుండెను.

కొన్ని సంవత్సరములు గడచిన పిదప వెంగమాంబకు బెండ్లి యీడువచ్చెను. కృష్ణయ్య సామాన్యకుటుంబి యయ్యును మంచి యల్లుని సంపాదించుటకై సకలప్రయత్నములు జేసెను. శుభసమయ మున వెంగమాంబకు వివాహమయ్యెను. కాని యది సుఖప్రదాయక ముగ బరిణమింపలేదు. సుమంగలీభవ యని పెండ్లిసమయమున వర్షిం చిన పెద్దల యాశీస్సులేమయ్యెనో! పాపము! కొలదికాలమునకే వెంగ మాంబ భర్తృవిహీన యయ్యెను.

ఇక నిట్టులే వైధవ్యముతో వెంగమాంబ జీవయాత్ర సాగింపవలసియుండెను. ఆమెకు జీవితసౌఖ్యములందలి యాశ కృశించి వైరాగ్యము జనించెను. సహజముగనే దైవభక్తిగల వెంగమాంబకీ వైరాగ్య మార్గము మఱింత చేయూతనిచ్చెను. ఏ సద్గ్రంథపఠనము తోడనో, యే హరినామస్మరణము తోడనో, యే సత్కార్యాచరణము తోడనో, యామె కాలక్షేపము జేయుచుండెడిది. మఱియును, శ్రీనృసింహస్వామి యాలయమునకు బోయి యనుదినమును గొంత తడ వేకాంతధ్యానము జేయుచుండెడిది కాలమిట్టులే గడచిపోవు చుండ నామె నిర్మల జీవితమున నంతరాయము వాటిల్లెను. లోకరీతి కడు చిత్రము. అయిన విషయములందును, కాని విషయములందునుగూడ లోకులు జోక్యము కల్గించుకొని తర్కింతురు. న్యాయాన్యాయ విచక్షణతోడ వారికి బనిలేదు.

వెంగమాంబ జీవితవిశేషములు చర్చలోనికి వచ్చెను. ఆమె గుణశీలములును, బవిత్రతయును ప్రశ్నింపబడజొచ్చెను. తన నైచ్య జీవితమును గప్పిపుచ్చుటకును వెంగమాంబ పుణ్యకార్యములను జేయుచున్నదని యపవాదు బయలుదేరెను. ఆ నోటిమాట యానోట బ్రాకిపోయి వెంగమాంబకు దెలియవచ్చెను. ఎట్టిమాట! ఆమె కది దుర్భరమై యక్కడనుండుట కిష్టపడలేదు. చిన్ననాటినుండియు సద్భక్తిపూర్వకముగ నృసింహస్వామి సేవాపరాయణత్వమున జీవితము దరింప జేసికొనుచున్న వెంగమాంబ, యిప్పు డాస్వామికి దుదమూరు నమస్కరించి శ్రీవేంకటాచలస్వామి పాదపూజకై వేంకటగిరికి బయనమై పోయెను. "కలౌ వేంకటనాయకః" యని పేరెన్నికగన్న శ్రీవేంకటాచలస్వామి యవతరణముచే బవిత్రమైన యా వేంకటాచలమందు, నపూర్వ భగవద్ధ్యాన లీలాలహరియందు నోలలాడుచు, వెంగమాంబ "శ్రీవేంక

టాచల మాహాత్మ్యము" అను కావ్యమును నీశ్వరప్రేరణచే రచించెను. ఇట్లే కొంతకాలము గడపిన పిదప నామె యీశ్వరసాయుజ్యము నొందెను.

అట్లు తన జీవితమును భగవంతుని పాదాంకితము జేసిన వెంగమాంబ యెంతయు గణనీయురాలు. అట్టి భగవద్భక్తురాలు గనుకనే కర్ణకఠోరమగు లోకనిందనైనను బాటింపక, యీశ్వర చింతనామృతముచే గాలము గడపగలిగెను. తన యపూర్వ పాండిత్య ప్రకర్ష గూడ దైవప్రసాదితమే యని యామె "వేంకటాచల మాహాత్మ్యము" నందొకచో వ్రాసియున్నది.

> చేరి తరికుండ పురి నారసింహదేవుఁ
> డానతిచ్చిన రీతిగ నే నిమిత్త
> మాత్రమునఁ బల్కుదును స్వసామర్థ్య మిప్పు
> డరయ యించుకయేని నాయందు లేదు.

ఇట్టి కవయిత్రియు, భక్తశిఖామణియు నగు వెంగమాంబ చిరస్మరణీయురాలు.



# రెండవకథ: ** కుమారాబాయి

## 1

పూర్వ మొకానొకప్పుడు సకలశాస్త్రపారంగతుడగు బ్రాహ్మణు డుండెను. పౌరోహిత్యవృత్తి నవలంబించి యా బ్రాహ్మణుఁడు తనకు సమస్తవిధముల ననుకూలవతియగు భార్యతోఁగూడి జీవ యాత్రను సాగించుచుండెను. సామాన్యకుటుంబమునకు జెందిన వారైనను నెట్టి కొఱతయు నెఱుంగక వారు కాలక్షేపమును జేయు చుండిరి. కాని సంతానము లేమిచే జీవితము సాఫల్యము కానేరదని యాదంపతు లొకింత విచారమనస్కులై శ్రీహరినిగూర్చి సదా ప్రార్థించు చుండిరి.

ఇట్లుండ నొకనాటి యర్ధరాత్రమున నాబ్రాహ్మణుని భార్యకు స్వప్నమం దొక దివ్యపురుషుడు కన్పించి "నీభర్తతో గూడ నీవు ద్వారకా పట్టణమునకు బోయి శ్రీకృష్ణుని సేవింపుము. నీ కోర్కె సఫ లీకృతము కాగలదు" అనెను. పెన్నిధిని గన్న పేదకైవడి నాభక్తు రాలు దిగ్గున మేల్కాంచి వృత్తాంతమునంతను భర్త కెఱింగించెను. అప్పుడు వానికి గల్గిన సంతోషమునకు మేరలేదు. తప్పక యెన్ని కష్ట ముల కోర్చియైనను దివ్యవాక్యమును శిరసావహింప వారు నిర్ధారణ చేసికొనిరి.

బ్రాహ్మణదంపతులు పయనమై ద్వారకాక్షేత్రము చేరిరి. శ్రీకృష్ణుని పాదచిహ్నములచే పునీతమైన స్థల మా ద్వారక. అట్టి ప్రదేశమును జూడగలిగితిమిగదా యని వారమితానందము నొందుచు శ్రీకృష్ణదేవాలయమునకు పోయిరి. భక్తిపారవశ్యమును సూచించు నేత్రములతో వారు దైవధ్యానము చేయుచుండ "వృద్ధ దంపతు

లారా! భక్త శ్రేష్ఠులారా! త్వరలో మీకు భగవద్భక్తురాలగు పుత్రిక కలుగ గలదు" అని యొక యశరీరవాక్కు వినబడెను. అంత వారు సంతసమొంది స్వామికి ప్రణమిల్లిరి.

వారి యుద్దేశము నెఱవేఱినను నా దంపతులు ద్వారకను విడువక పుత్రిక జన్మించునంతవఱకు నచ్చటనే యుండుటకు సంకల్పించుకొనిరి. మఱికొన్ని దినముల కా బ్రాహ్మణుని భార్య గర్భవతి యయ్యెను. క్రమముగ నవమాసములు నిండి యామెకు ప్రసూతి కాలము సమీపించెను. అప్పటి యావేదన నామె భరింపజాలక శ్రీకృష్ణుని స్తుతింపసాగెను. కరుణాసాంద్రు డగు శ్రీహరి మంత్రసాని రూపమున వచ్చి యామె సుఖప్రసవమగునట్లు గావించెను. శుభముహూర్తమున నాడుశిశువు జనించెను. ఆ పసిపాపకు శ్రీహరి కృష్ణమంత్రము నుపదేశించి యొక్కమారు నిజస్వరూపమును జూపి యదృశ్యుడయ్యెను. ఆ దివ్యదృశ్యమును భార్యాభర్తలుగూడ గాంచి తమ జీవితము తరించినదని దైవస్తుతి గావించిరి.

కుపారాబాయి యని నామకరణము జేసి, తల్లిదండ్రు లా బాలికను మిగుల గారాబముతో బెంచుచుండిరి. ఈశ్వర ప్రసాదిత యగు నా బాలిక తమ జీవితముల నుద్ధరింప జన్మించె నని వారు నమ్మి వర్తిలుచుండిరి. ఆ బాలికయు, మాటలు రాదొడంగి నప్పటినుండియు, జగదేకనాథు డగు శ్రీహరిని తలంచుచు, వానిని గూర్చిన చిన్న పాటలను ముద్దులొలుక బాడుచు, తల్లిదండ్రులను నానందాబ్ధి నోలలాడించుచుండెను. ఇట్లు కొంతకాలము జరిగినపిదప శ్రీహరి వారు స్వగ్రామము బోవుటకు ననుజ్ఞనిచ్చెను. వారును స్వామియొద్ద సెలవు గైకొని, విడువలేక, విడువలేక, ద్వారకను వీడి స్వగృహామునకు జేరుకొనిరి.

## 2

కాలము జరిగిన కొలదియు కుపారాబాయికి పెండ్లియీడు సమీపించెను. ఆ దినములలో బాల్యవివాహము లనువర్తనీయములు గావున, తల్లిదండ్రులు లాభమును దగిన వరుని కిచ్చి వివాహముఁ జేసిరి. మఱి కొలది దినములకే యామె నత్తవారింటికి బంపు సమయ మగుదెంచెను. అందులకై యా దంపతులు తగిన యేర్పాటులన్నియు గావించుచుండిరి. ఈ విషయము కుపారాబాయికి దెలియవచ్చెను. అత్తవారింటికి బోయినచో దన దైవభక్తి, దైవధ్యానము, — అన్నియు నంతరించునని యామె భయపడెను. అందుచే నెవ్వరికిని దెలియకుండ నొకనాటి నిశీథమున నామె ద్వారకకు దారిపట్టెను. తెల్లవారగనే, బ్రాహ్మణ దంపతులు కొమార్తె కానరాకుండుట జూచి మితిలేని దుఃఖము పాలైరి. సిద్ధాన్నము చెదరిపోయిన ట్లయ్యెను. కృష్ణప్రసాదితమైన శిశువు; ముద్దుమురిపెములతో పెంచబడిన బాలిక; అపార దైవభక్తి గల కన్యక; సంసారమును నిర్వహింపనున్న గృహిణి, - అన్నియు తలచికొని దురదృష్టవంతు లగు నామె జననీజనకులు తల్లడిల్లిరి.

కొమార్తెను వెదకుటకై తండ్రి బయలుదేరెను. పెక్కుప్రదేశములందు జూచి యాతఁడు తుదకు ద్వారకకు జేరెను. అచ్చట కుపారాబాయి, యీశ్వరచింత జేయుచు నత్యంతానందముతో నుండెను. ఆమెనుగాంచి తండ్రి "కుపారా, నీవేల మమ్ములను విడిచి వచ్చితివి? చిన్ననాటినుండియు పెంచి పెద్దదానిని జేసిన దిందులకా? అత్తవారింటికి బంపి నిన్ను గృహలక్ష్మిగ జేయుతఱి యిదేటిపని? గృహస్థాశ్రమధర్మమును స్త్రీలు పాటింపవలదా?" అని దీనముగ బల్కెను. అందులకు కుపారాబాయి నవ్వుచు "తండ్రీ, మీ యనుజ్ఞ లేకుండ వచ్చుట యపరాధమే. కాని నన్నత్తవారింటికి బంపుటకు

మీరు ప్రయత్నించుచుండ నాకు దుఃఖము గల్గినది. ఎఱుగవా! తండ్రీ! సంసారము సాగరమని పెద్దలు చెప్పుట? అట్టి సంసార విషయములందు జిక్కుకొని యీశ్వర ధ్యానమును బూర్తిగ సాగించుకొనుటెట్లు? అందుచే ముక్తిదాయకమగు నీ భక్తిమార్గము ననుసరించుట శ్రేయస్కరమని తలంచి వచ్చితిని" అని గంభీరముగ వాక్రుచ్చెను.

అందులకు తండ్రి "బిడ్డా, నిన్నే మా జీవితసర్వస్వముగ నెంచుకొని గర్వించుచుంటిమి. మా వార్ధక దశయందు నండవై నిల్చెదవనుకొంటిమి. మా కట్టికనుటకూడ లేకుండ నీవు దూరప్రదేశముల కరుదెంచుట పాడియా? పోనిమ్ము. నీవు సాంసారిక విషయముల జిక్కుకొనవలదు. మా గృహమునందే యుండి నిర్విఘ్నముగ నీ భక్తిమార్గము ననుసరింపుము" అని పలుక కుపారాయొక్క హృదయము చలించెను. తండ్రియొక్క కోర్కెను నెఱవేర్చుటకై తిరిగి యామె స్వగ్రామమును జేరెను. కుపారాబాయియొక్క భర్తయు, అత్తమామలును గూడ నిప్పు డామె భక్తిపారవశ్యమున కచ్చెరువొంది, యామె కడ నుపదేశమునొంది శ్రీహరిని స్తుతింప మొదలిడిరి.

ఈ కుపారాబాయి వృత్తాంత మంతయు నెట్లో యా యూరి రాజునకు దెలియవచ్చెను. రాజుగారి కటాక్ష ప్రసాదము ననుభవించుచున్నవారిలో నీ బ్రాహ్మణు డొకడు. అందుచే రాజుగారి కతడు పరిచితుడే. రాజు బ్రాహ్మణుని బిలిచి "భూసురోత్తమా! నీకొమరిత యగు కుపారాబాయి గాఢమైన దైవభక్తి గలదని వినియుంటిని. మఱియును నామె శ్రావ్యకంఠమున భక్తి కీర్తనలను బాడుచుండునని దెలిసికొంటిని. ఆమె గానామృతమును చవి చూడవలెనని యున్నది" అని తన యపేక్షను దెల్పెను. అందులకు బ్రాహ్మణుడు సంతసించి "మహాభాగ్యము రాజా! ఈ యదృష్టమును మాకు

కలుగజేసినందులకు కృతజ్ఞుడను'' అని సవినయముగ బల్కెను. పిమ్మట నొక దినమున నాతడు కుపారాబాయిని రాజసమ్ముఖమునకు దోడ్కొని పోయెను. ఆమెయు దనకు లభించిన గౌరవమునకు లోలోన నానందించి హరికీర్తనలు గానము చేసెను. భక్తి పరవశుడైన యా భూపాలుని హృదయము పల్లవించెను. కుపారాబాయి యొక్క గాఢభక్తివిశ్వాసముల నాతడు శ్లాఘించి యామెకడ జ్ఞానోపదేశము నొందెను.

## 3

అటుల బుద్ధివికాసము నొందిన రాజు క్రమక్రమముగ భక్తి మార్గమును బట్టి యొకానొకసమయమున తీర్థయాత్రకు వెడలెను. ప్రయాణమైపోవుచు నతడొక యరణ్యమున విశ్రమించెను. మనుష్య సంచారములేని యాస్థలమున కొన్ని యడవి యేనుగులు విహరించుచు రాజునుగాంచి చంప నుంకించెను. భయభ్రాంతుడై రాజు కుపారాబాయిని స్మరించి యీశ్వరుని స్తుతించెను. దేవుడు భక్తరక్షకుడు. ఆపదవస్థయందున్న రాజును రక్షించుటకై శ్రీహరి సింహరూపమును దాల్చివచ్చి యేనుగులను బాఱదోలెను. ఈ దైవకృత్యమునకు రాజు మిక్కిలి సంతసించి యారాత్రి కొక యూరుచేరి యచ్చటి సత్రమునందు విడిసెను.

ఆయూరి రాజున కొక కుమార్తెయుండెను. ఆమెను భేతాళుడు పట్టి పీడించుచుండెను. ఆరాత్రి యామె తండ్రికి భేతాళుడు స్వప్నమందు గాన్పించి "రాజా! ఈయూరి సత్రమునందు యాత్రికుని దుస్తులు ధరించియున్న రాజును నాకు బలి యొనర్చుము. నాదారిని నేను పోయెదను'' అని చెప్పెను. రాజందులకు సమ్మతించి సత్రమునం

దున్న రాజును కొనిరమ్మని భటులనంపెను. వారు నిద్రించుచున్న రాజును దెచ్చి బందీయం దుంచిరి.

రాజు మేల్కాంచుసరికి చుట్టును కారాగారము గోచరమయ్యెను. తాను విడిదిచేసిన సత్రము లేదు. అదియంతయు మోస మని యతడు వెంటనే గ్రహించి చేయునదిలేక యీశ్వర స్తవము గావించెను. మరల భక్తరక్షణార్థమై దేవుడా యూరి రాజునకు కలయం దగపడి "రాజా! తెలియక నాభక్తుని బంధించి పాపము నొడికట్టుకొనుచున్నావు. త్వరితముగ వానిని విడిపింపుము'' అనియెను. అబ్బురపాటుజెంది రాజు తాను గావించిన పాపకార్యమునకు జింతిల్లుచు బంధింపబడిన రాజును తక్షణమే విడుదలగావించి, క్షమింపుమని యాతని బ్రార్థించి తన కుమార్తెకు గలిగిన యవస్థనంతయు నెఱింగించెను. అప్పుడా విచారవృత్తాంతమును విని హరిభక్తుడగు రాజు "నీ కుమార్తెను రేపు నాకడకు బూజాసమయమున గొనిరమ్ము'' అనెను.

ఆయూరి రాజట్లేచేసెను. వారు వచ్చుసరికి భక్తుడు శ్రీకృష్ణ పాదారవిందములను భజించుచుండెను. పూజానంతరము రాజు రాకుమారికకు మంత్రతీర్థము నిచ్చెను. అప్పుడామె స్వస్థురాలై యథాప్రకారముగ నుండెను. ఈమాహాత్మ్యమునకు వారాశ్చర్యమొంది తమకుగూడ జ్ఞానోపదేశము గావింపుమని వేడుకొనిరి. రాజు తన గురుదేవతయైన కుపారాబాయి యనుజ్ఞగైకొని వారికి నుపదేశము గావించెను. ఆ విధముగ కుపారాబాయి పెక్కుమందికి గురువై జ్ఞానోపదేశమునకు నిలయమయ్యెను. సామాన్య బ్రాహ్మణ కుటుంబమున జన్మించినను కుపారాబాయి తన పూర్వపుణ్యమహిమచే నఖండదైవభక్తి కలదై భర్తను తల్లిదండ్రులను అత్తమామలనేగాక రాజులనుగూడ భక్తివరవశులుగ జేసి వారి సుజ్ఞానోదయమునకు మార్గదర్శిని యయ్యెను.

## మూడవకథ: * * పన్నా.

### 1

ప్రభుసేవాపరాయణతయం దెక్కుడుగ ఖ్యాతిగడించిన నాయికామణులలో పన్నా యెంతయు స్తుతిపాత్రురాలు. ఆమె రాజభక్తి నిరుపమానము. పసిపాపయగు ప్రభువు, అఖండ సంస్థాన భారము వహింపవలసియున్న ప్రభువు, ఆపదవస్థయం దున్నతఱి, వాని రక్షణార్థమై తన ప్రియపుత్రుని ప్రాణముల నర్పించుటకైన వెనుదీయని వీరవనిత పన్నా.

ఒకానొకప్పుడు చిత్తూరు రాజ్యమునకు సంగరసింహుడు అధిపతి. శూరుడగు నాతడొకమారు శత్రుసేనల జెండాడుచు వీరమరణము నొందెను. నాటి సాంప్రదాయానుసరణముగ సంగరసింహుని భార్యయగు కరుణావతి, పతివ్రతాధర్మమును నిర్వహించుటకై భర్తతో గూడ సహగమనము జేయ నిశ్చయించుకొనెను. కాని యట్లొనర్చుట కామె కొక్క సంశయ ముండెను. పుత్రుడగు ఉదయసింగు పసికూన, వాని గతి యేమగునో యని యామె భయము.

పన్నా యీ రాణికి ప్రియమైన దాసి. తన భక్తి విశ్వాసములచే నామె నమ్మికకు పాత్రురాలయ్యెను. అట్టి పన్నా రాణి యొక్క సందేహమును గమనించి యామెతో నిట్లు పల్కెను. "ఎందులకు, రాణీ, యిట్లు విచారించెదవు? కుమారరక్షణకంటె పతివ్రతాధర్మ నిర్వహణమే కడుంగడు శ్రేయస్కరము. నీ పిల్ల డేమైపోవునో యని యించుకేనియు సంశయింపకుము. నీ చరణదాసి యగు ఈ పన్నా సజీవమైయున్నంతవఱకును వానికెట్టి విపత్తును వాటిల్లదు. వాని ప్రాణమునకు నా ప్రాణము లడ్డువైచెదను. రాణీ! నీవిక వగవకుము. నీ

పుత్రుని నా వశముజేసి, నీ ధర్మమును నీవు నెఱవేర్చి ధన్యురాలవు కమ్ము."

కరుణావతి చలించెను. పన్నాయందంత శౌర్య సాహసములు డాగియున్నవని యామె మున్నెఱుంగదు. అభయహస్త మిచ్చుచున్న యా గభీర వాక్యములను వినినంతనే రాణి సంతుష్టాంతరంగ యయ్యెను. ఇంతకన్న నామెకు గావలసినదేమి? తన సంశయము నివారణజేసి యభీష్టసిద్ధికి దోడ్పడిన పన్నాకు కృతజ్ఞతను దెల్పుచు, ఉదయసింగుని తుదిమారు ముద్దాడి కరుణావతి సహగమనము గావించెను.

ఉదయసింగు కేవలము పసిబాలుడు. అట్టివాడు రాజకార్యముల నేమి నెఱవేర్పగలడు? అందుచే "బాన్‌బీరు" అను సర్దారు రాజప్రతినిధిగ వ్యవహారములను సాగించుటకు నియమింపబడుటచే బాన్‌బీరు అధికారము వహించెను.

రాజ్యాధికారము హస్తగత మయ్యెనన్న మాటయేగాని "బాణబీరు"నకు మనశ్శాంతిలేదు. ఎప్పటికైనను ఉదయుడు పెద్దవాడై సింహాసనార్హు డగునని వానికి దెలియును. అప్పుడు తన యధికార మంతరించును. అయ్యది తనకు శాశ్వతముగ నుండవలెనన్నచో దనకు నడ్డుదగులు ఉదయుని దొలగింప వలసియుండెను. వానిని జంపివైచుటయే యన్నిటికంటె నుత్తమోపాయము. అదియును వెంటనే గావించుట మఱింత శ్రేయస్కరము. ఈవిధముగ "బాణబీరు" ఆలోచించెను. తన యాధికారసంపదకై ఉదయుని వధించుటకంటె వేఱు మార్గము వానికి గాన్పించలేదు.

కాని వధించుటయును కష్టసాధ్యమే. ఉదయుడు పన్నా రక్షణయందుండెను. ఆమె వానిని ప్రాణతుల్యముగ గాపాడుచుండెను. "బాణబీర్" ఉదయుని కుశలమును కనుగొను మిషపై బోయి వానిని

జంపవలెను. ఇక వేఱువిధానము లేదు. తుదకు "బాన్‌బీరు" అట్లే చేయ నిశ్చయించుకొనెను.

ఎట్టులో యీ కుచ్చితపు పన్నాగ మొకసేవకునికి దెలియవచ్చెను. వానిది మిక్కిలి జాలిగుండె. అతడు బాన్‌బీరుని భీకరసంకల్పమునకు భయపడి, యెట్లైనను ప్రభువును రక్షింప దలచుకొనెను. తలచుకొనెనే గాని యేమి చేయుటకును వానికి దోచలేదు. పరుగు పరుగునబోయి పన్నాకు విషయమంతయు విన్నవించెను. పన్నా కడు ధైర్యవంతురాలు. మాయాలోచనలందు గూడ దిట్ట. అందుచే రాబోవు విపత్తును గూర్చి వృథా చింతింపలేదు. ఎట్టులైనను ఉదయుని రక్షింపవలెను. వానిని దన ప్రాణము లడ్డువెట్టియైనను కాపాడెదనని కరుణావతికి వాగ్దానము జేసియుండెగదా! వెంటనే యామె యొక యుపాయమును బన్నెను. ఆ సేవకుని నొక పూలగంప దెమ్మనెను. అందు ఉదయుని దాచి, యేదైన నిరపాయమైన స్థలమునకు బంపివేయవలెనని యామె యుద్దేశము. కాని యట్లు చేసినచో ఉదయు డేడీ యని బాన్‌బీరు పన్నాను నిర్బంధింపవచ్చును. అట్టి యావకాశము లభింపకుండ వానిని మోసపుచ్చు నిమిత్తమై పన్నా తన పసిపిల్లవానికి ఉదయుని దుస్తుల నలంకరించి, ఉదయుని స్థానమున బరుండ బెట్టుటకు నిశ్చయించుకొనెను.

ఈ సంగతి తెలియగనే యా వచ్చిన సేవకుడు భీతిజెందెను. రహస్య మెచ్చట బహిర్గత మగునో యనియు పన్నా యన్యాయముగ దన పిల్లవానిని గోల్పోవునే యనియు వా డనుమానించెను. అందులకు పన్నా "ఏమి, సేవకా, యాలోచించుచున్నావు? నా పిల్లవానిని పోగొట్టుకొనిన బోగొట్టుకొందునుగాక! నాచిన్ని ప్రభువు రక్షితుడైన జాలును. వాని జీవితమునకు నెట్టి విపత్తును రానీయకుండ రాణికి వాగ్దత్తము జేసియుంటిని. అది నెఱవేర్చి తీరవలయును. ప్రభుని

పాలిణములకంటె నాకుమారుని ప్రాణము లెక్కుడుగావు. సంస్థానమున కధిపతియగు వాడతడు. వారి యన్నమును తినుచున్న మనము వాని కెట్టి యాపత్తును గలుగనీయకూడదు. స్వామిరక్షణార్థము సేవకు డెట్టి త్యాగమునైనను జేయువలయును''అని విశ్వాససాహసము లుప్ప తిల బల్కెను. సేవకు డాశ్చర్య మొంది, యామెకు దోడ్పడుటకు నిశ్చ యించుకొని యామె యానతిపై ఉదయుని పూలగంపయందు సురక్షిత ముగ రహస్యప్రదేశమునకు జేర్చెను.

# 3

నాటిరాత్రి రాజమందిరమున నెల్లరు నిద్రించుచుండగ 'బాఁబీరు' ఖడ్గపాణియై, పన్నా యుండెడి తావునకువచ్చి క్రౌర్యముతో "పన్నా, ఉదయసింగెక్కడ?" అనెను. పన్నా ధైర్యము వీడలేదు. క్షణములో జరగనున్న ఘోరవిపత్తును లక్ష్యము చేయలేదు. ప్రియ పుత్రుడు ఖడ్గమునకు బలియగు చున్నాడనియైనను జంకలేదు. "అదిగో" యని యామెయెలవైపునకు వ్రేలుజూపెను. ''వానికి కుశలమా''? యనుచు 'బాఁబీరు' శయ్యను సమీపించి తటాలున పిల్లవానిని కత్తితో బొడిచెను. కెవ్వుమని బయల్వెడలిన కేకతో పిల్లవాని ప్రాణ ములు అంతరాళమున కెగిరిపోయెను. మఱియొక కేకవైచి పన్నా స్పృహతప్పి నేలవ్రాలెను. 'బాఁబీరు' అదృశ్యుడయ్యెను.

అర్ధరాత్రమున నాకస్మికముగ వినబడిన యార్తనాదమును విని రాజమందిరములో నుండెడి దాస దాసీజనమంతయు నాతురతతో మూగెను. వారు చూచుసరికి రాజకుమారుని శయ్యయంతయు రక్త ప్లావితమైయుండెను. ఒకమూల పన్నా పడియుండెను. వారు విస్మయ చిత్తులై యీ క్రూరహత్యారహస్యమును దెలియగోరి పన్నాకు

శైత్యోపచారములు గావించిరి. కొంచెము స్పృహకలిగిన తోడనే యామె "మోసము, మోసము, హంతకుడు పలాయితుడయ్యెను; పట్టుకొనుడు, పట్టుకొనుడు!'' అని కేకలిడెను. వెంటనే యెక్కడివా రక్కడ హంతకుని వెదుక బర్విడిరి.

పన్నా లేచి చూచునరికి దన పుత్రుడు విగతజీవుడై యుండెను. పాపము! పన్నాకు దుఃఖ మాగలేదు. వాగ్దాననిర్వహణము నకై యామె తన పిల్లవాని ప్రాణముల నర్పించెనేకాని సహజముగ పొంగి పొరలి వచ్చెడి దుఃఖతరంగముల నెట్లు నిరోధింపగలదు? తల్లి బిడ్డల ప్రేమానుబంధ మనిర్వచనీయముగదా!

కొంతతడవు వల్లే విలపించి, పన్నా చెదరి పోయిన ధైర్యమును బిగియబట్టుకొని, ఉదయు డేమయ్యెనో యని యాతురతతో నటనుండి వెడలిపోయెను. పోయిచూడగా రాకొమారు డెప్పటియట్ల చిఱునవ్వు వెన్నెలలు వెలయించుచు పన్నాపై కెగబ్రాకెను. పుత్రుని కోల్పోవుట వలన బొరలివచ్చుచున్న తన దుఃఖము నట్టులే మ్రింగి, మహావిపత్తు నుండి రక్షితుడయ్యెగదా! యను సంతోషముతో పన్నా వానిని హృదయమునకు హత్తుకొనెను. ఇక నచ్చట నుండుట యపాయకరమని నిర్ణయించుకొని, యా నిశీథముననే రాజప్రాసాదము వీడి, రాజ్యపరిసరములు దాటి, ఉదయునితో గూడ నామె పలాయిత యయ్యెను.

అట్లు పోయి పోయి, ఆరావళీపర్వతశ్రేణి కావలి వైపుననున్న ప్రదేశముజేరి, అచ్చటి ప్రభువగు 'అస్సాషహా' యను వాని శరణు జొచ్చి, పన్నా తన యావద్విషాదవృత్తాంతమును నెఱుకపఱిచెను.

## 4

'మహా' కరుణార్ద్రహృదయుడు. తన ప్రభువగు సంగరసింహుని కొమారునికా యిట్టి కష్టములు సంభవించుట యని యాతను రోష పూరితుడయ్యెను. తప్పక ఉదయుని సురక్షితముగ బెంచి పోషించెదనని వాగ్దత్తము గావించి, యనుమానమున కాస్పదముగాకుండ పన్నాను తిరిగి చిత్తూరునకు బొమ్మని చెప్పెను. పన్నా స్వస్థానము జేరుకొని, యేమియు నెఱుగనిదాని వలె నటించుచుండెను.

అచ్చట మహాయొక్క కృపావలోకనముచే ఉదయుడు దిన దినప్రవర్ధమాను డగుచుండెను. కొంత కాలమున కెట్టులో ఉదయుని వార్త చిత్తూరునకు దెలియవచ్చెను. "బాణబీరు" యొక్క క్రూర పరిపాలనా విధానమున క్రుగ్గుచున్న సర్దారు లందఱును గలిసి గూడు పుఠాణీచేసి "బాణబీరు"ను పదచ్యుతుని గావించి ఉదయుని దోడ్కొని వచ్చి పట్టాభిషిక్తుని జేసిరి.

అప్పటి యానందదృశ్యమును గాంచి పన్నా తన జీవితాశయము సాఫల్యమొందె నని యపరిమితానందము నొందెను. మహారాణా ఉదయసింగున కామె వినయపూర్వకముగ జోహారు సల్పెను. అత డును నామెను మాతృభావముతోడ నాదరించి గౌరవింప దొడగెను.

వాగ్దాననిర్వహణమునకై యీ విధముగ దన శిశువును గోల్పోయి తన చిన్ని ప్రభువును రక్షించి సింహాసనాధిష్ఠితునిగా జేయ గల్గిన పన్నా జీవితగాథ పుణ్యాంగనాప్రపంచమున సువర్ణాక్షరముల లిఖింపబడియున్నది. ప్రభుసేవాపరాయణతయందును స్వామికార్య నిర్వహణమందును తన జీవిత సర్వస్వమును ధారవోసిన పన్నా పుణ్యా త్మురాలు. చిరంజీవి, వెలలేని పచ్చ.

## నాలుగవ కథ: * * * విశాల

## 1

సకల సద్గుణరాశియై, అఖండపరిజ్ఞానాన్వితయై, అద్భుత తపశ్శాలినియై, తనయశోదీప్తిచే భారతపుణ్యనారీబృందమున కమూల్యాభరణమై వెలయుచున్నది విశాలదేవి. విదిశాపురపరిభువగు విశాలునికిని వాని రాజరమణియగు వీరమహాదేవికిని జన్మించిన యీ బాల సుశీల; తేజోరాశియై, కీర్తికాంత యయ్యెనన్నచో నాశ్చర్యమేమి ? విశాల నిరుపమానసౌందర్యాన్వితయై, నిష్కల్మషహృదయయై, సత్కార్యాచరణాభిలాషిణియై, విజ్ఞానవతియై, జననీజనకుల నానందతరంగడోలికల నూగించుచుండెను.

చంద్రబింబము పగిది విశాల దినదిన ప్రవర్ధమానయై వివాహయోగ్యవయస్కురాలయ్యెను. నవనవోన్మేషితమగు నామె లావణ్యప్రతిభ పెక్కు రాకుమారుల దృష్టి నాకర్షించెను. విశాలుఁడును సమయమెఱిగి, కొమార్తె స్వయంవరమహోత్సవమును బ్రకటించెను.

పలు దేశములనుండి రాకుమారులు ప్రయాణసన్నద్ధులైరి. ఎవరికి వారు తమ బాహువిక్రమవిఖ్యాతిచే విశాల ప్రేమఫలమును బొందవలెనని యువ్విళ్ళూరిరి. కాని యందఱకును అవీక్షితుడన్నచో గుండె బెదరు. అవీక్షితుడు సూర్యవంశపు రాచబిడ్డ. కరంధమహారాజు తనయుడు. రూపవంతుడు, మేధాసంపన్నుడు, వీరాగ్రేసరుడు. అట్టి వాడు వచ్చినచో దమకెట్టి యవకాశ ముండదని భయపడి, తక్కిన రాజకుమారు లందఱు నైక్యమై అవీక్షితునిపై బడిరి. ఎట్టి వీరశ్రేష్ఠుడైన నొంటిగ నపార సైన్యనివహముల ధాటిని నెదుర్కొను టెట్లు? అప్పటికిని, ధైర్యము వీడక అవీక్షితుడు పోరెను. కాని తుదకు శత్రువు

లచే జిక్కెను. వారు వానిని బంధితుని జేసి, జయజయధ్వానములతో విశాలుని సమక్షమున నిలువబెట్టిరి. అతడును బంధితుని కారాగారమం దునుప నాజ్ఞాపించెను. పిమ్మట కుమార్తె నుద్దేశించి "పుత్రీ, పరాక్రమమదాంధుడును, గర్వోన్మత్తుడును నైన అవీక్షితు డిక నాటంకము లేదు. ఈ వచ్చిన చక్కని రాకుమారులలో నెవ్వరినైన వరింపుము. శీఘ్రముగ వివాహ మొనర్చెదను" అని పల్కెను.

విశాల తల యెత్తలేదు; తండ్రిని జూడలేదు. వచ్చిన రాకుమారులను వీక్షింపలేదు; పూలహారము చేపట్టలేదు; అట్టులే శిలాప్రతిమవలె నిలువబడియెను. అంతకంతకు నామె ముఖకమలము వర్ణవిహీనమయ్యెను. ఆనందశైవలినీతరంగమాలికలలో దేలియాడవలసిన సమయమున నేలకో విశాల విషణ్ణహృదయయయ్యెను. తండ్రి కది యేమియో గ్రాహ్యము కాలేదు. "ఇంకెందులకు జాగు విశాలా! నీ జీవితేశ్వరుని కోరుకొనుము" అనెను. ఇక నామె తన హృద్వేగమును బిగియబట్టలేకపోయెను. జనకా! లజ్జాపరిత్యక్తనై విన్నవించుచుంటిని. ఇప్పుడు జరుగనున్న స్వయంవరము నన్నుగూర్చియే యైయున్నది. కావున నా స్వాభిప్రాయము ముఖ్యమైనది. ధర్మముచే నేను మీకు విధేయురాలనై యుండవలసినను నీవిషయమునందు మాత్రము నా మనోనిశ్చితమును మార్చుకొనజాలను. నా ప్రేమయంతయు వీరశిఖామణి యగు అవీక్షితునియందు లగ్నమైయున్నది. నా మనస్సాక్షిగ వరించిన యాతడే నా మనోవల్లభుడు' అని విశాల వచించుసరికి విశాలుని ముఖమున నెత్తురుచుక్క లేదు. ఇదివఱకెన్నడును దన కుమార్తె యంత నిష్కర్షగ, నిర్భయముగ, మాటాడియుండలేదు. అప్పు డేమి చేయుటకును దోపక స్వయంవరప్రయత్నమును విరమించితి నని యాత డందఱకును దెలియబఱచెను. మనస్తాపముతోడ నెక్కడివా రక్కడికి నిర్గమించిరి.

# 2

అవీక్షితుడు నిష్కారణముగ విదిశాపురమందు చెఱయందున్న వాడని విని యాతనితండ్రియగు కరంధుడు కుపితుడయ్యెను. తోడనే సైన్యమును బ్రోగుచేసికొని విశాలునిపైకి దండెత్తివచ్చెను. కరంధుడు శౌర్యసాహసపరాక్రమోపేతుడు. అట్టివానికి విదిశాపుర విజయము సులభకార్యమే యయ్యెను. ఇరువైపుల వారికిని నోడంబడిక జరగెను. అవీక్షితుని తక్షణమే విడుదలజేయుటకును, జరగిన యవమానమునకు బదులుగ వానికి విశాల నిచ్చి పెండ్లి చేయుటకును, విదిశాపురప్రభు వొప్పుకొని కొమార్తెకా సంగతి దెలియజేసెను. ఎవ్వానిని దన మనోపీఠమందు బ్రతిష్ఠించి ప్రాణనాథునిగ పూజించుచున్నదో, యట్టివాడే తనకు భర్తగ లభింప నున్నాడని విని, విశాల యత్యంతానందపరవశురాలయ్యెను.

విముక్తుడై, అవీక్షితుడు రాజమందిరమున నిలువబడెను. "నా కుమార్తెను బరిణయ మాడి యనుగ్రహింపుము" అని విశాలుడనుచుండగనే యాత డడ్డువచ్చి "రాజసత్తమా! విశాలకన్య హృదయము నాయందు లగ్నమైయున్న దనుటకు సంతసము. కాని కష్టతరమైనమాట చెప్పక తప్పకున్నది. శత్రువులచే పరాజితుడనైన నే నెట్టి గౌరవమునకును నర్హుడనుగాను. క్షమింపుము" అని దీనముగ బల్కసరికి, రాజమందిరమున పిడుగు పడినట్లయ్యెను. విశాల నిర్ఘాంత పడి, కొంతతడవునకు దెప్పరిల్లి, అవీక్షితుని పాదములకు మ్రొక్కుచు "వీరకుమారా! నీవే నా నాథుడ వగుదువను నమ్మకతో నున్నాను. నీ కొఱకెంత తపించుచుంటినో చెప్పజాలను. నీవులేని నా జీవితము తమోవృతము. విఫలము. నన్నధోగతి పాలు సేయక గ్రహింపుము" అని సవినయముగ వేడుకొనెను.

ఆవాక్యములు అవీక్షితుని యందు మార్పు కలిగింపలేదు. విశాలుడు చెప్పినను, కరంధుడు చెప్పినను నెవ్వరేమి చెప్పినను, అవీక్షితుడు తన పట్టువీడలేదు. చేయునదిలేక కరంధుడు కుమారునితోగూడ స్వస్థానమునకు మఱలిపోయెను.

అప్పటి నుండియు విశాల జీవితమునందు మార్పు. ఆమె ప్రేమ ఫలము నంగీకరింపక అవీక్షితుడు వెడలిపోయినప్పటినుండియు నామెకు లోక మనిన విరక్తి కల్గెను. అంత నామె యొకనాడు తల్లి దండ్రులను సమీపించి "నా కిక సెలవిండు. అరణ్యములకు బోయి యాముష్మిక వాంఛతో జీవయాత్ర సాగించెదను. నాకు వేఱుమార్గమువలదు" అని వేడుకొనెను. ఇక నా జననీజనకుల విచారమునకు మేరలేదు. ఎట్టి కష్టమెఱుంగని యాబాలిక లేనిపోనివిరక్తిమార్గముల బడుట వారెట్లు సహింపగలరు. "బిడ్డా, నీకి దేటిజ్ఞానము? అడవులపాలగుట భావ్యమా? నలుగురిలో నగుబాటుగాదా? భాగ్యభోగ్యముల ననుభవింపవలసిన సుకుమారి విట్లు గావించుటపాడియా? వలదు. ముమ్మాటికిని వలదు" అని వారు హితబోధ చేసిరి. కాని విశాల సమ్మతింపక మారుమాటాడక యే యరణ్యమార్గములఁ బడిపోయెను. అక్కడికి జేరి యామె యాహారపానీయములను విసర్జించి "యెప్పుడు శరీరమును బరిత్యజించి పరమానందమును బొందుదునా" యని నిరీక్షించుచుండెను.

ఈ విధముగ కాలము జరగిపోవుచుండ నొకనా డామెకు స్వప్నమందొక సందేశము వినవచ్చెను. "ఎందులకు, బాలా! నీ వీ విధముగ కృశించెదవు? ప్రయోజన మేమి? అనతికాలముననే నీవు కోరిన వానిని బెండ్లాడి కీర్తిశాలియగు కుమారుని బడయుగలవు. కావున నీ వీ నిరశన వ్రతము మాని ఫలముల నారగింపుచు సౌఖ్యముగ నుండుము. ఇయ్యది యీశ్వరవాక్యముగ భావించి వర్తింపుము." అది విని విశాలయాశ్చర్య

నిమగ్నమయ్యెను. తన్ను వలదని నిరాకరించి వెడలిన అవీక్షితుడు మరల దన్నెట్లు వివాహమాడునో, తానెట్లు కుమారుని బడయు నుండెనో యామెకు గ్రాహ్యము కాలేదు. అయినను విశ్వాసపాత్రమగు నీశ్వరాజ్ఞను నామె యుల్లంఘింపజాలక, తన యుపవాసవ్రతమును మాని ఫలాహారమును జేయుచు నచ్చటనే ద్రిమ్మరుచుండెను.

## 3

అవీక్షితుడు స్వస్థానము జేరి, పెండ్లిమాట దలంపక విరక్తి మార్గము ననుసరించెను. అది గాంచి వాని తల్లిదండ్రులు భీతిజెంది వాని నెట్టులైన బెండ్లి చేసికొను మని యనేక విధముల బలవంతపెట్టిరి. కాని యాతడు తన పట్టు వీడక విరాగిగనే యుండెను. ఏమిచేయుట కును దోపక, వారొక యుపాయమును గనిపెట్టిరి. తల్లియగు వీర మహాదేవి కివిచ్ఛక మను నోము పట్టెను. ఆ వ్రతనియమములనుబట్టి నోచుకొనిన వారి నేది యడిగిన నది వారు నిర్వహింపవలసియుండును. అదిచాల కష్టసాధ్యము. అందుచే మహాదేవి కుమారుని సాయము వేడెను. మొదట నాతడు కొంత సంశయించినను, తల్లియాజ్ఞ శిరసా వహించి, యామె కార్యసాఫల్యమునకు దోడ్పడ బూనుకొనెను. అంత నొకనాడు కరంధమహారాజు భిక్షుకరూపమున వచ్చి మహాదేవిని గాంచి "సుశీలా! నీవు నీకుమారునికి బెండ్లిచేసి వంశమును నిల్పుము. అది నాకోర్కె." యనెను. ఆమె యేమియు ననజాలక కుమారుని వంక జూచెను. అవీక్షితుడు శంకాపూరితుడై "నేను వివాహమాడదలచు కొనలేదు. నీవేదైన మఱొకటి కోరుము" అని భిక్షుకునితో ననియెను. "రాజా! యీ తీవ్రనిశ్చయముచే నీజననియొక్క వ్రతమును భంగపఱు పకుము. ఈ నిశ్చయముచే నీ వపకీర్తిపాలగుదువు. ఆలోచించు కొనుము" అనెను. చేయునది లేక అవీక్షితుడు వల్లెయనినంతనే భిక్షుకుడు

మాయవేషమును త్యజించి కరంధముడై నిల్చెను. ఆ మాయోపాయమున కెంతయు అవీక్షితు డాశ్చర్యపడెను.

కొన్ని దినములు గడచినపిదప అవీక్షితుడు వేటకై విపిన భూమికి వెడలెను. కొంతదూర మేగునరికి "రక్షింపుడు, రక్షింపుడు" అను భయానకనాదము వినవచ్చెను. తోడనే క్షత్రియశౌర్యము పొంగ, అవీక్షితుడు ధ్వనివచ్చిన తావునకు బరుగెత్తెను. అచ్చట నొక రాక్షసు డొక సుందరీమణియగు యువతీలలామను బట్టి పీడించుచుండెను. వాడు అవీక్షితుని జూచినంతనే యా యువతిని వదలివైచి రాజకుమారునిపై బడెను. కొంతతడవు ఘోరముగ బోరాటము జరగినపిదప, రాక్షసుడు రాకుమారుని ధాటి కాగజాలక జీవములను బాసెను.

ఈ సత్కృత్యమున కానందించి దేవతలు పుష్పవృష్టి గురిపించిరి. అప్పుడే యాశ్వరవాణి కూడ వినవచ్చెను. "రాజోత్తమా! దేవతలను గూడ బాధించుచున్నట్టి రాక్షసుని సంహరించినందులకు మేమెంతయు సంతసించుచున్నాము. నీ వెంతయు ప్రశంసాపాత్రుడవు. నీ విప్పుడు రాక్షసుని బారినుండి తప్పించినది విశాల యను పుణ్యాంగన. నీ కొఱకే యరణ్యమున నేకాకియై కృశించుచున్నది. ఆమెను గ్రహించి, నీ తల్లి యొక్క వ్రతమును సాఫల్యము జేయుము. నీకు జగద్విఖ్యాతుడగు పుత్రరత్న ముద్భవించును." అవీక్షితు డాశ్చర్య మొందెను.

మూర్ఛాక్రాంతురాలైన విశాల తెప్పరిల్లి నేత్రములు విచ్చునరికి నామెకు అవీక్షితుడు ప్రత్యక్షమయ్యెను. ఆ పునస్సమావేశమున వారికి కల్గిన యానందమునకు మేరలేదు. "విజయుడవై నన్ను గ్రహించుచున్నావు. నా జన్మ తరించినది. నా మనోభీష్టము నెఱవేరినది" యని విశాల పల్కెను.

ఆ సమయమునందే యచ్చటి కరుదెంచిన తుంబురుడు వారిరు వురకు వివాహము గావించెను. అనతికాలములో వారికి మరుత్తరుడు అను పుత్రుడు గల్గెను. విశాల పుణ్యము ఫలించెను. ఆమె జీవితము తరించెను.

మానసమున దొలుత ప్రేమించినవానినే మనోనాథునిగా భావించి యాతడు నిరాకరించినను నడవులపాలై యాతనినే పతియని మనమున నిశ్చలభక్తితోడం బూజించిన విశాలయొక్క పాతివ్రత్య మహిమయు, మనోనిశ్చయమును నామెకు సంకల్పసిద్ధిని జేకూర్చ గల్గెను.

పతివ్రతలు సంకల్పసిద్ధలు.

---



# అయిదవ కథ ** పండితరామాబాయి

## 1

విద్యావతి, సంఘసంస్కారిణి, ధర్మదాత, వేదాంతిని, నిర్మల చరిత, ఆదర్శజీవినియైన రామాబాయి పండితురాలి కథ, యాధునిక భారతేతిహాసమునందే గాక, ఇంగ్లాండు, అమెరికా, ఆస్ట్రేలియా మొదలగు పాశ్చాత్య దేశములందు సహితము స్తుతిపాత్రమైనదనిన నాశ్చర్యమేమియు లేదు. మానవలోకము నూర్ధ్వముఖమునకు లాగి కొనిపోవు నాధ్యాత్మికశక్తులలో నిట్టి పుణ్యస్త్రీల పావనజీవగీతిక యొకటి.

మంగుళూరు మండలమునందు అనంతశాస్త్రి పేరెన్నికగన్న పండితుడు పూనాపండితుడగు రామచంద్రశాస్త్రిగారియొద్ద విద్యనభ్యసించి, మైసూరు మహారాజుగారి యాస్థానపండితుడుగ పదివర్షములు సకలసౌఖ్యముల ననుభవించిన వాడాతడు. ఆనాటి విద్యాపరిషత్కేంద్రములలో ముఖ్యమగు వారాణసీక్షేత్రమును దర్శింప గాంక్షించి, భార్యా సమేతుడై యాతడప్పుడే యచ్చటి కరిగెను. కాని దురదృష్టవశమున, భార్య చనిపోవుటచే తిరిగి భాగ్యవశమున లభించిన యొక బాలికను అనంతశాస్త్రి యచ్చటనే వివాహమాడి జన్మస్థానమునకు దిరిగివచ్చెను.

వచ్చినదాది యాబాలకు అనంతశాస్త్రి విద్యగఱప ప్రారంభించెను. ఆవిషయము చుట్టుపట్ల పండితులకు కంటకమై వారు వానిని బాధింపసాగిరి. స్త్రీలకు విద్య యశాస్త్రీయ మని వారి తలంపు. అట్టి వారి విపరీత వ్యాఖ్యానములకు విసుగుజెంది అనంతశాస్త్రి భార్యా సమేతుడై గంగమూల మను నరణ్యమునకుజేరి చిన్న పర్ణశాలయందు జీవితము సాగింప మొదలిడెను. ఇచ్చటనే వారికి రామాబాయి జనన

మొందెను. అప్పటికే యీ దంపతులయొద్ద కూడినధనము వ్యయమై పోయెను. అందుచే వా రాయరణ్యావాసము వీడి వెలికి రావలసివచ్చెను. అప్పటినుండియు వారి చరిత్రి విషాద రూపమును దాల్చెను.

వారిని నాదరించువారు లేరు. గౌరవించువారు లేరు. ఇంతియె గాక పలువురు ప్రిల్లదప్పపల్కులతో హింసించెడివారు. ఆనాటి సంఘపుకట్టుబాటుల నతిక్రమించి, అనంతశాస్త్రి భార్యకు విద్యా బోధ చేయుటచే వారి కష్టములు మఱింత యధికమయ్యెను. అయినను వా రధైర్యము చెందలేదు. ఊరూరునకు, పల్లెపల్లెకు సంచారము జేయుచు, వేదపఠనముచేతను, హరికథాకాలక్షేపముచేతను జీవయాత్రి సాగించుచుండిరి. కాని యిట్టి పర్యటనక్రిమ మెన్నినాళ్ళవిచ్ఛిన్నముగ జరుగును? కష్టపరంపరలచేతగాని పరమాత్ముడు తన భక్తాళిని బరీక్షింపడుకదా! అట్టి యగ్నిపరీక్షకు దాళగలవారే యీశ్వర ప్రేమకు బాత్రిలు.

## 2

ఇట్లుండ గాలక్రమమున రామాబాయి కొక సోదరుడును, సోదరియును గలిగిరి. దారిద్ర్యమునకు దోడు సంసారాభివృద్ధికూడ నామె తల్లిదండ్రుల విచారమునకు గారణమయ్యెను. అయినను వారు భగవంతునిపైననే భారమువైచి స్థలాంతరముల సంచరించుచు కాలము గడపసాగిరి. కాని యెంత కాల మిట్లు? వారికి దాన ధర్మము లొసంగు దాతలుకూడ నరుదైరి. ఒక్కపూట గడచుటగూడ గష్టమయ్యెను. అట్టి యాపత్కాలమున వారు చేయగల్గినదేమి? ఇతరులపై నాధారపడి, వారికిగూడ గష్టభారమైనందులకు విచారపడి, వంశక్షయము జేయ నిశ్చయించుకొని, యప్పుడు వారున్న తిరుపతిక్షేత్రిమును వీడి, దాపుననున్న విపిన వాటిక కేగిరి.

ఆ కాననసీమలందు వారు పదునొకండు దినము లాకులను, నలములను దినుచు గడపిరి. కాని యాకటిబాధను, మనోవేదనను నోర్వలేక, తటాకమునందు మునిగి ప్రాణములు బాయుటకు నిశ్చయించుకొని, అనంతశాస్త్రి, తక్కినవారుకూడ నట్లులే చేయవలెననియు, లేనిచో నెవరి యిష్టానుసారము వారు చనవలసిన దనియు జెప్పెను. తన ముద్దుకొమరితయైన రామాబాయిని బిల్చి "నా యవసానకాలము సమీపించినది. నీ వైనను బ్రతికి బట్టకట్టినచో, నీశ్వర సందేశమును విస్తరింపచేయుము" అని యాతడు దీనముగ జెప్పెను. ఈ విషాదదృశ్యమును జూచి కుమారు డోర్వజాలక, అట్లు చనిపోవుట కూడదనియు, దిరిగి గ్రామమునకుబోయి యాయుర్దాయ మున్నంత కాలము జీవింపవలసినదే యనియు, దండ్రిని బతిమాలెను. అంత వారందఱును దిరిగి గ్రామములోనికి వచ్చిరి.

కాని వారికష్టము లీడేరుటెట్లు? మొదటి రెండు మూడు దినములును నెవరో సహృదయులు సాయము చేసిరి. అయిన నేమాయె? అనంతశాస్త్రి బలహీనుడై, విషజ్వరమువాతబడి యాకస్మికముగ మరణించెను. అంతట వారు విచారపీడితులై, యచ్చోటువీడి, కొందఱి మిత్రుల ధనసహాయముపై రాయచూరు పట్టణము చేరిరి. ఇక్కడను వారిని దరిద్రదేవతయే యెదుర్కొనెను. దీనికి దోడు వారి తల్లికూడ మృత్యుముఖమున బడెను. ఆ దిక్కులేని పిల్లల దుఃఖమును వర్ణించుటెట్లు! తల్లిశవమును పిల్లలే శ్మశానవాటికకు గొనిపోవలసి వచ్చెను. అచ్చటి కర్మల నొనర్చి తిరిగి వచ్చుసరికి, రామాబాయి సోదరి తుది గుటుకలు వేయుచు, సోదరీసోదరులను జూచి ప్రాణములను బాసెను.

ఇట్లొంటరులై రామాబాయియు, సోదరుడును దొరకినచోట భుజించి, లేనిచోట నుపవసించి, యొక్కొక్కప్పుడు చిన్న కూలిపనుల

వలన వచ్చిన స్వల్పద్రవ్యముతో భుక్తిమార్గ మేర్పఱచుకొని, దేశాటనము ప్రారంభించిరి. అట్లు పాంచాలము, కాశ్మీరమువఱకు, ఉత్తర హిందూస్థానము నంతను దిరిగి తిరిగి, తుదకు వారిర్వురును 1878 లో కలకత్తానగరము చేరుకొనిరి.

# 3

ఇచ్చటికి వచ్చుసరికి రామాబాయి జాతక చక్రమున కొంచెము మార్పు కలిగినది. కాని కష్టములనుండి యామె పూర్తిగ గట్టెక్కలేదు. ఒకానొక సందర్భమున నామె సంస్కృతమున మాట్లాడుట కొందఱు పండితులు గమనించి, కౌతుకముతో నామెను బిలిచి, యామె విషయమంతయు నడిగి, పండితసభ నొకదానిని సమావేశ పఱిచిరి.

అందు రామాబాయి రమారమి యిరువదివేల శ్లోకములను బఠించుటయేగాక సంస్కృతమున ససర్గళముగ నుపన్యసించెను. ఆపాండితీ ప్రకర్ష కా పరిషత్తువా రచ్చెరువొంది యామెకు 'సరస్వతి' 'పండిత' యను గౌరవ బిరుదములను బ్రసాదించిరి. ఆనాటి బ్రహ్మసమాజ నాయకు లగు కేశవచంద్రసేను, కాళీచరణ బెనర్జీ మొదలైనవారితో నిప్పుడే యామెకు బరిచయ మేర్పడెను.

ఈ సంతోషసమయమున నామెకు దిరిగి దుఃఖము సంభవించెను. ఆమె సోదరుడు హఠాత్తుగ మరణించెను. ఇక నామెకు 'నా' యనువారు లేరైరి. అయినను నామె ధైర్యముతో కలకత్తా నగరమందే స్నేహితులమధ్య నివసించుచు ఘోషాస్త్రీలకు వారిధర్మములను గూర్చి యప్పుడప్పుడు బోధించుచు గాలము బుచ్చుచుండెను. ఇట్లుండ నామె బిపిన్ బిహారిమేధావి యను బెంగాలీ న్యాయవాదిని బ్రేమించి సివిల్ వివాహచట్టము ప్రకారము పెండ్లిచేసికొనెను.

అటుపిమ్మట రామాబాయి భర్తతో అస్సాములోని శిల్చార్

అనుచోటఁ గాపురము చేయబోయెను. ఇచ్చటనే యామె బైబిల్ గ్రంథమును జదువుట తటస్థించినది. కుతూహలముతో జదివి తెలిసికొని యందలి క్రైస్తవమతమును స్వీకరింప నిచ్ఛగించి రామాబాయి భర్త యనుమతి నడిగెను. కాని యాతడు నిరాకరింపగా నామె మనస్సు నొచ్చెను. ఇట్లుండగా నామె గర్భవతి యయ్యెను. ఇంక కొలది దినములకే మనోరమ యను కొమార్తె జన్మింపనుండ మేధావి యశస్సాత్తుగా కలరావాత బడెను. రామాబాయి కిరువదినాల్గు సంవత్సరములు. రెండేండ్లయినను సంసార సౌఖ్యము ననుభవింపక పూర్వాము వితంతు వయ్యెను. జీవనభారమునకు దోడు పసిబిడ్డ.

ఇట్టి క్లిష్టసమయమున నామెను మహారాష్ట్రవాసులు తమ స్త్రీలకు బోధించుటకై రమ్మని యాహ్వానించిరి. అంత నామె పూనా నగరమునకు జని యనేకస్థలములలో స్త్రీ సమస్యలనుగూర్చి యుపన్యసింప జొచ్చెను. అప్పటి యామె విజ్ఞాన వైదుష్యమును అభిప్రాయ సాహసమును నానాటి సంఘపెద్దలగు రెనడీ, కేల్కారు, భండార్కరు, మొదలైనవారు మెచ్చుకొనిరి. ఇచ్చటనే నీలకంఠ గోరియా యను మతప్రచారకునియొద్ద నామె క్రైస్తవమత సాంప్రదాయములను గూర్చి తెలిసికొనెను.

ఇట్లుండ 1883 లో రామాబాయి కొమార్తెతో గూడ ఇంగ్లాండునకుబోయి "వాంటేజ్ నారీబృందము" వారి యాతిథ్యమును బొంది, మత సాంఘిక విషయములను బెక్కింటిని నేర్చుకొనెను. పిదప నామె "చల్టెన్‌హాం" కళాశాలయందు సంస్కృతోపన్యాసకురాలుగ నియమింపబడెను. అచ్చట నున్నప్పుడు గణితశాస్త్రము, భౌతికశాస్త్రము, ఆంగ్లవాఙ్మయము మొదలైనవి యామె నేర్చుకొనెను. ఆ సంవత్సరముననే క్రైస్తవమతమునుగూడ స్వీకరించెను.

పిమ్మట నామె అమెరికావారిచే నాహ్వానింపబడి యచ్చటికి బోయి యనేకోపన్యాసముల నిచ్చెను. హైందవస్త్రీల యభివృద్ధికై తానూహించిన మార్గముల నన్నియు వారికి దెలియజెప్పి కొంత ధన సహాయమును బొంది 1889 లో రామాబాయి హిందూదేశమునకు దిరిగివచ్చెను.

## 4

వెంటనే బొంబాయిలో "శారదాసదనము" అను సంఘమును స్థాపించి, హైందవస్త్రీల యభివృద్ధికై రామాబాయి పాటుపడ ప్రారంభించెను. ఆ సూచన త్వరితముగనే బహుజనాంగీకారమై యామె కమితమైన సాహాయ్యము చేకూరెను. అంత రామాబాయి యాసదనమును 1892 లో పూనానగరమునకు మార్చి శాశ్వత నివాస స్థానము నేర్పఱచెను. అనాధబాలికలకును, బాల వితంతువులకును శరణాలయ మది. త్వరితముగనే ప్రఖ్యాతి గాంచిన యా సేవాగృహము నకు దేశము యొక్క నలుమూలలనుండియు బాలికలు వచ్చి చేరిరి. ఎంతమందినో రామాబాయి స్వయముగ బోయి తోడ్కొని వచ్చెను. ఈ బాలికల కందఱకును స్వయంసహాయ పద్ధతులపై పనులన్నియు నేర్పబడుచుండెను.

ఇట్లుండగా 'సదనము' యొక్క కోశాగారము ఖాళీకాజొచ్చెను. అమెరికావారు సహాయము చేసెదమని వాగ్దానము జేసిన పదియేండ్లును బూర్తికావచ్చెను. హైందవ సోదర సోదరీమణు లావమాత్రము సాను భూతిని జూపలేదు. ఇక నా సంస్థ సాగుటెట్లు? అందుచే నామె తిరిగి 1898 లో అమెరికాకు బోవలసివచ్చెను. అచ్చటి కరిగి యామె

మఱికొందఱు యుదారహృదయులను బట్టి ధనసహాయమును బొంది తిరిగి వచ్చెను.

అప్పుడే రామాబాయి పూనా నగరమునకు నలుబది మైళ్ళ దూరమునందున్న 'ఖేడగన్' అనుచోట "ముక్తి"యను నాశ్రమమును స్థాపించెను. రామాబాయి యొక్క సంఘమున కిది ముఖ్యస్థానమయ్యెను. కొలది కాలములోనే పిల్లల సంఖ్య కొన్ని వందలు పెరిగెను. ఆశ్రమ వాసులందఱును నెవరిపనులను వారు నేఱవేర్చుకొనవలెను. విద్యతో పాటుచేతిపనులుగూడ నేర్పబడుచుండెను. దేశమునందు'నా'యనెడి వారు లేక యల్లాడెడి బాలికలను, స్త్రీలను జేరదీసి, వారి జీవితములను బనికి వచ్చునట్లు జేయుటయే రామాబాయి యుద్దేశము. ఈ యుత్కృష్ట కార్యమునం దామెకు బెక్కుమంది క్రైస్తవ యువతులును, హిందూ సుందరులును జేయూతనిచ్చి, యామెతోగూడ నిక్కట్టులకు లోనైరి. 1900 లో ఇంగ్లాండునుండి మనోరమాబాయి తిరిగివచ్చి తల్లికి నాశ్రమ కార్యక్రమమునందు జాల సహాయపడ జొచ్చెను. 'ఖేడగన్' అనాధ శరణాలయ మున్నతాదర్శములపై నాధారపడెను. విశ్వమానవ సోదరత్వము, భూతదయ, సంఘసేవయు నచ్చట ప్రతియాశ్రమవాసి కిని నాభరణములు. దేహము యొక్కయేగాక, మానసికాభివృద్ధికిని, నాత్మోపలబ్ధికిని నాధారభూతము లగు విధ్యావిధానము లనుసరింప బడుచుండెను.

ఇట్టి మహాసంస్థకు మూలకారకురాలైన రామాబాయి పండితు రాలు, నిర్మలజీవి, కష్టజీవి. హిందూవితంతువుల పద్ధతి ననుసరించి తెల్లని వస్త్రమును ధరించి, మాహారపదార్థములను గూడ మితముగ భుజించుచు, సకలసౌఖ్యములను విడనాడి, కేవలము సన్న్యాసినివలె జీవనము జేయుచు, నామె తన యాశ్రమాభివృద్ధికై రేయింబవళ్లు

పాటుబడెను. అట్టి నిరంతరకార్యసాధనము, అబలయైన యామె యారోగ్యమును నకాలవ్యయమునకు దెచ్చెను. దీనికి దోడామె యాశల కునికిపట్టగు మనోరమాబాయికూడ నీ సమయముననే మరణించుట చేత, రామాబాయి భగ్నహృదయయై, ఏప్రిల్ 1922 లో బరలోక గతురాలయ్యెను.

మానవసేవయే భగవత్సేవ యని నమ్మి, తన జీవితము నంతను నాదర్శప్రాయముగ సాగించిన రామాబాయి మరణమునకు జింతిల్లని వారు లేరు.

## ఆఱవకథ: *** చాంద్ బీబీ.

### 1

తాను స్త్రీయని పాటింపక, సమయోచితముగ రాజకార్య నిర్వాహణ భారము వహించి, శత్రుసంహారలీలలందు బాల్గొని, యత్యద్భుత యుద్ధకౌశలమును వెలిబుచ్చి, పుట్టినింటికిని మెట్టినింటికిని గూడ కీర్తిగడించిన ప్రఖ్యాత మహమ్మదీయ వీరాంగన - చాంద్‌బీబి. ఈ ప్రజ్ఞావంతురాలు, పదునాఱవ శతాబ్దమధ్యమున, అహమ్మదు నగరు సుల్తానుగ నుండిన 'నిజాంషహా' యొక్క ప్రియపుత్రిక. దురదృష్ట వశమున బాల్యావస్థయందే తల్లిని గోల్పోయిన యీమెను, తండ్రి యత్యంతానురాగాతిశయముతో బెంచుచుండెను. జనని లేనికొఱత వాటిలనీయక 'షహా' యనుక్షణమును నతిజాగరూకతతో బ్రవర్తించుచుండెను. చాందియును దన తండ్రియొక్క యాదరణానురాగసంపదలతో భ్రమసిపోయి, తల్లిమాట జ్ఞప్తియే లేనిదానివలె కాలము సంతతము 'షహా' చెంతనే గడపుచుండెడిది. సుల్తాను, రాజ్యవ్యవహారములను జక్కబెట్టుచున్నపుడేమి, మృగయావినోదార్థమై వెడలునపుడేమి, యుద్ధభూమికి సైనికులను సాగనంపుచున్నపుడేమి, బీబీ వానితోనుండి యన్ని విషయములను సూక్ష్మముగ గ్రహించుచుండెడిది. షహా యును పుత్రులు లేమిచే చాందికే విలువిద్య మొదలుగాగల యస్త్ర కళలను నేర్పించి యానందించుచుండెను. సహజసౌందర్యవతియగు బీబికి విద్యాభూషణములు వన్నె దెచ్చెను.

### 2

ఇట్లుండగా చాందికి బెండ్లియీడు సమీపించెను. ఎందఱో మహమ్మదీయరాజకుమారు లామెను వివాహమాడుటకు రాయబార

ములు సాగించిరి. దీర్ఘాలోచనజేసి షహా తుదకామెను బీజాపూరు ప్రభువగు అదిల్‌షహా కిచ్చి పెండ్లి గావించెను. అదిల్‌షహా సహజ సాహసగుణోపేతుడు. సద్గుణకీర్తి విస్ఫురితుడు. అట్టివానికి వాదోడు జేదోడునై బీబీ పరిపాలనావిధానమునందు ప్రజానురంజకమగు కార్యములను బెక్కు గావించి ప్రఖ్యాతివడసెను. అంతకుమున్ను బోరాడు కొనుచుండిన సర్దారులు తమ కక్షలను మఱచిపోయి యీయామె నేర్పు వలన నైకమత్యము వహించి రాజ్యరక్షణకు దోడ్పడిరి. కాని యీ సద్భాగ్యోదయమును జాలకాలము జూచుటకు అదిల్‌షహా నోచు కొనలేదు. కొలది సంవత్సరములకే యతడకాలమృత్యువు వాత బడెను. బీబీ యొంటరియై అదిల్‌షహాయొక్క చిన్న మేనల్లుడైన ఇబ్రహీం అనువాని పక్షమున రక్షకురాలుగనుండి రాజ్యపాలనము సాగించుచుండెను. బీబీ రాజ్యాధికారము వహించిన కొలది కాలమున కామె సర్దారులకేగాక చుట్టుపట్ల రాజ్యములవారికిగూడ నామె కంట కురాలయ్యెను. ఇట్టివైరివర్గము నడుమ నిల్చుట యెట్లులని బీబీ యను కొనుచుండ ఇబ్రహీం పెద్దవాడై తానే రాజ్యపాలనమునకు గడంగి బీబీని నామె యధికారమునుండి తొలగించెను.

ఇవ్విధముగ నవమానింపబడి బీబీ బాష్పపూరితనేత్రములతో తండ్రి సంస్థానమగు అహమ్మదునగరు చేరెను. అచ్చటగూడ పరిస్థితులు ప్రతికూలముగనే యుండెను. తండ్రియగు నిజాంషహా కాలధర్మము నొందెను. తదుపరి వాని కొమరు లొకరితో నొకరు తగవులాడి రాజ్యము నరాజకముగ జేసిరి. అంతయు నల్లకల్లోలమై మాన ప్రాణ ములు దక్కునా యని ప్రజలు భయపడ దొడగిరి. అట్టి విషమ పరిస్థితు లను జూచుచు బీబీ తటస్థముగ నుండలేకపోయెను. ఆ ఘోరసంఘటన యీయామె వీరరక్తము నుప్పొంగించెను. ఇక బీబీ మాటాలోచన చేయ

లేదు. ఒక సామాన్యరాజవంశమునకు జెందిన పిల్లవానిని సుల్తానుగ బాటించి వాని పక్షమున దా నధికారముద్ర వహించెను.

వెంటనే యభిప్రాయభేదము లంతరించి, యెక్కడి యరాజక మక్కడ మాటుమడగి రాజ్యమున నెల్లెడల శాంతి నెలకొనెను.

అధికారిణి యగు నంత మాత్రముననే సంతృప్తినొందక, బీబీ దేశక్షేమ నిమిత్త మనేకసత్కార్యములను జేసెను. ఆమె తన వ్యక్తిత్వ మును బ్రకటించి, పరిపాలనావిధానమందలి ప్రతియంశమును శ్రద్ధతో నిర్వహించెడిది. ఇక నన్యాయమునకు దావు లేదు. అశాంతికి గార ణములేదు; అన్నియు నామె ప్రతిభానముచే సమసిపోయెను.

అట్టి సద్గుణరాశియొక్క తేజోవిలసిత మగు నాయకత్వముక్రింద అహమ్మదు నగరరాజ్యప్రసూనము సంపూర్ణవికాసము నొంది, పరిమళ మును నలుదిక్కుల విరజిమ్మెను. అయ్యది యానాటి మొగలు సామ్రాట్టైన అక్బరునిగూడ మోహితుని జేసెను.

## 3

తనంతటి ప్రఖ్యాత పురుషుడు చక్రవర్తియైయుండ, నబలయగు బీబీకూడ ప్రసిద్ధ రాజ్యతంత్రజ్ఞురా లని పేర్గాంచుట అక్బరునకు స్వప్న మందైన నిష్టములేకపోయెను! ఆమె నంతరింపజేసినగాని యిక వానికి జిత్తశాంతి లేదు. దానిని సాధించుటకై కొడుకగు మురాదును నపార సైన్యముతో అహమ్మదు నగరుపై దాడి పంపెను.

ఆవార్త బీబీకి తెలియవచ్చెను. ఆమె యెట్టిధమైన మనఃక్లేశ మును నొందలేదు. ఆమె వీరాంగన. సమర రహస్యములు బాగుగ నెఱింగిన మేధావిని. అట్టి తఱి నామె కేమిభయము? తన సైనికులందఱ

నొక్కచో సమావేశపఱిచి ప్రబోధము గావించెను. "సైనికులారా, నాకొఱకుగాదు. మీకొఱకుగాదు. దేశముకొఱకు, శత్రునాశము కొఱకు నడుములు బిగింపుడు. అహమ్మదు నగరమును నపఖ్యాతిపాలు జేయకుడు. మహమ్మదు పవిత్రను స్మరించి ముందంజవేయుడు" అని యామె గంభీరవాక్కులతో ప్రోత్సహించుసరికి యోధులందరును సమర సన్నాహులైరి.

యుద్ధము ప్రారంభమయ్యెను. మొగలు లెన్ని మాఱులో కోట ప్రాకారములను పగులగొట్ట బ్రయత్నించిరి.ఎన్ని రహస్యోపాయములనో గావించిరి. కాని వాని నన్నిటిని మహమ్మదీయవీరు లెదుర్కొనుచు ధైర్యముతో బోరాడిరి. పెక్కుకష్టములకు లోనై మొగలులు నిరాశ జెంది తుదకు వెనుకంజవేయు టఱి నదియే మంచిపని యని మురాదు గుర్తెఱింగి సంధి జేసికొను మిషపై మఱలిపోయెను.

## 4

జరగిన వృత్తాంతము విని అక్బరు కుపితుడయ్యెను. మొగలు వీరులేమి, స్త్రీని నోడింపజాలకపోవుట యేమి యని వాని యాగ్రహము. "మీరు రక్షకులైన గావచ్చును. సంధి వలనుపడదు. నేను బోయి జయగీతము నాలపించెదను" అని చెప్పి యఖండసేనాసమేతుడై బీబీపైం గయ్యమునకు వెడలెను.

ఉత్తరముననుండి సముద్రతరంగములవలె బొరలివచ్చుచున్న శత్రుసైన్యమును జూచి బీబీ మఱియొకమారు యుద్ధసన్నద్ధయయ్యెను. ఈ మాఱు చుట్టుప్రక్కరాజ్యము లామెకు గొంత సాయపడెను. మునుపటివలెనే యీయామె యుద్ధప్రారంభమున తన యోధుల నందఱను

నుద్దేశించి యిట్లు సంబోధించెను. "వీరులారా, ఆపద్దేవత మనరాజ్య పరిసరముల దాండవమాడుచున్నది. అజాగరూకతతో నుంటి మేని లోన బ్రవేశించి సర్వనాశ మొనర్చును. మీ దేశఖ్యాతి వీదియే యని మఱువకుడు. మీయది మహమ్మదీయసాంప్రదాయ మని మఱువకుడు. మన కంఠములందు ప్రాణములుండువఱకు అహమ్మదునగర మపఖ్యాతి ననుభవింపగూడదు. జయలక్ష్మి యాశీస్సులు మనవి. కార్యశూరులు కండు."

ఆ గంభీర సందేశము ప్రతిధ్వనించుతఱి సైన్యసమూహములు దద్దరిల్లెను. కుబుసమువీడిన త్రాచులవలె వారందఱు బుసగొట్టుచు శత్రువుల నెదుర్కొనిరి. వీరి సేనాని చాంద్‌బీబీ. వారి నాయకుడు అక్బరు పాదుషహా. అఖండ మేధాసంపన్ను లిరువురునుగూడ. సమాను లెదుర్కొని నప్పుడే సమర రమ్యత.

హోరాహోరి పోరు జరగుచుండెను. తన కిట్టి నిరోధము కల్గునని అక్బరెన్నడును దలంచి యుండలేదు. బీబీ సామాన్యస్త్రీ యనియే యనుకొనెనుగాని, యాయుధపాణి కాగల్గిన ధీశాలిని యని భావించి యుండలేదు. తనకంటె నేమాత్రమును వెనుదీయక సైనికుల నుత్సాహపఱపుచు, రణలీల సాగింపుచున్న వీరాంగనను జయించుటెట్లు? ఆమెనుజూచి సిగ్గుజెందుటయా, అపజయము నొందుటయా, లేక యామె స్నేహ మపేక్షించి సంధిజేసికొనుటయా? ఏది యుత్తమమైన దని అక్బరు కొంతతడవు తర్కించి తుదకు సంధికి గడంగెను. శాంతిప్రియ యగు బీబీకి నంతకంటె గావలసిన దేమి? అందుచే నామె అక్బరుతోడి సంధి నంగీకరించి, యాతనిని మిత్రభావముతోడ నాదరించెను.

రాజ్యమును శత్రుహస్తగతము గాకుండ గాపాడగల్గితిని గదా యనియే బీబీయొక్క సంతోషము. కాని కొందఱు సర్దారు లీ సంధికి

విపరీతవ్యాఖ్యానము లొనర్చి, బీబీ స్వార్థపరురాలని నిశ్చయించు కొనిరి. తమ యభిప్రాయము యథార్థమైనదో కాదో యని కూడ సంశయింపక, వారు బీబీని రాణివాసమందు నిర్జనస్థలమున హఠాత్తుగ వధించిరి. అంతటితో చాంద్‌బీబీయొక్క చరిత్ర విషాదాంతముగ పరిణమించెను.

విషాదాంత మైననేమి? దేశసేవాధురంధరురాలగు బీబీ, రాజ్యభారనిర్వహణనిపుణతగల బీబీ; అత్యద్భుత యుద్ధకౌశలముగల బీబీ; అక్బరు సామ్రాట్టంత వానినిగూడ నాశ్చర్యాన్వితుని జేసి వాని గౌరవమునకు బాత్రురాలైన బీబీ; ఎల్లకాలములకు హిందూదేశ చరిత్రయందు నసామాన్యపుణ్యస్త్రీయై వెలుంగుచున్నది. ఆమె దేశాభిమానము, మేధాసంపత్తి, కార్యదక్షత, వాత్సల్య విలసనము, నందఱకును నాదర్శప్రాయ మని వేఱుగ వక్కాణింప బనిలేదు.



# ఏడవ కథ: *** సావిత్రి.

## 1

పూర్వ మొకానొకప్పుడు మద్రదేశమును అశ్వపతి యను మహా రాజు పాలించుచుండెను. ఆతని భార్యపేరు మాళవి. అసమానజ్ఞాన సంపత్తియు, నిరుపమాన సుగుణవిశేషమును గలిగిన యీ రాజదంప తులు, తమ వంటివారు మఱియొకరీ లోకమున నుండబోరని యని పించుకొనుచు, విచారమనునది యెఱుగక, హాయిగ కాలము గడపు చుండిరి.

కాని యెంత సుసంపన్నులైనను నేదియో కొఱత యుండక పోదు. అటులనే యెట్టి సౌఖ్యము గలవారికైనను నేదియో లోపము వాటిలక మానదు. ఈ రాజదంపతులకు గూడ పెద్ద కొఱత యుండెను. వారికి సంతానము మాత్రము ప్రాప్తించలేదు. ఇక నెన్నియుండిననేమి? వారి భాగ్యము ననుభవించుటకు, వారి యానందము జూచిగొనుటకు, వారి యుల్లాసము పెంపుచేయుటకు, వారి జీవితము నానందమయముగ జేయుటకు, నొక్క బిడ్డయైనను లేదు. అదియే వారికి గలిగిన గొప్ప లోటు. అందునిమిత్తమై, వారెన్నియో తీర్థయాత్రలు సాగించిరి; ఎన్నియో వ్రతచర్యలు గావించిరి; ఎన్నియో దానధర్మములు జేసిరి; ఎందఱ దేవతలనో యారాధించిరి.

ఆ ప్రకారము సుమారు పదునైదు వత్సరములు గడచెను. అప్ప టికి వారి ప్రార్థనలు ఫలితము నొందెను. సావిత్రీదేవికి కనికరము గలిగెను. ఆమె అశ్వపతికి ప్రత్యక్షమై "నీకు త్వరితముగనే కొమార్తె కలుగ గలదు"అని దీవించి యదృశ్యయయ్యెను.

నవమాసములు నిండిన వెనుక మాళవికి శుభసమయమున చక్కని బాలిక జన్మించెను. దేవీ ప్రసాదితయగు నాశిశువు, దివ్య కాంతులతో మెఱసిపోవుచుండెను. సంతోషాతిశయముతో, జననీ జనకులా బాలికకు సావిత్రి యని నామకరణముజేసిరి.

లేక లేక కలిగిన యాపుత్రికను వా రల్లారుముద్దుగా బెంచుచు, కోరిన వన్నియు నిచ్చుచు, నామె బాల్యచేష్టలను గాంచి యానంద పరవశులగుచుండిరి. ఆమెయు, నానాటికి వృద్ధి చెందుచు, సౌందర్య రాశియును, సుగుణఖనియునై, తల్లిదండ్రుల యాదరణానురాగము లకు బాత్రురాలగు చుండెను

పెండ్లి వయస్సు సమీపించుచున్న కొమార్తెనుగాంచి యామెకు తగినవరు డెచ్చట నున్నవాడని రాజు యోచన జేయుచుండెను. ఆ సమ యముననే త్రిలోకసంచారి యగు నారదమహాముని యచ్చటి కరుదెం చెను. అశ్వపతి వాని నాహ్వానించి గౌరవించెను. నారదుడును సంత సించి రాజు నుద్దేశించి "రాజా! నీవేదియో తలంచుచుంటివి. నేనది తెలిసికొనదగునా?" యని యడిగెను. అందులకు రాజు వింతజెంది "మీకు దెలుపరాని యోచనలు నాకేమి యున్నవి? యుక్తవయస్సు వచ్చిన నా కొమార్తె పరిణయ విషయమే నన్ను కలత పెట్టుచున్నది. అని నుడివెను. అందులకు ముని "రాజా! ఈ విషయమున నీకింత శ్రమ యెందులకు? నీకుమార్తెనే యడిగినచో బాగుండునుకదా!" యనియెను. వెంటనే సావిత్రికి వర్తమానించెను.

సావిత్రియు మందహాసముతో ముసిముసినవ్వులు నవ్వుచు తండ్రిచెంతకు వచ్చి మునీశ్వరునకు సవినయముగ నమస్కరించి నిలువబడెను. అంత రాజామెను జేరదీసి "బిడ్డా! యిప్పుడు నేను

నినొక్క ముఖ్యవిషయమునుగూర్చి ప్రశ్నించుచున్నాను. సావధానముగ యోచనచేసి ప్రత్యుత్తరమిమ్ము. నీ భావిజీవితమునకు నీవే కర్తవగుచుంటివని జ్ఞప్తియందుంచుకొనుము. నీకు పెండ్లియీడు వచ్చినది. ఇంతదనుక నీవెవ్వరి నైన వరించి యున్నచో జెప్పుము. లేనిచో, నెవ్వని వివాహమాడుదువో తెల్పుము. అట్లు జరిపెదను'' అని పల్కెను.

## 2

సావిత్రి మిక్కిలి బిడియపడెను. అట్టి ప్రశ్న తన్నెన్నడు నడుగబడునని యనుకొనలేదు. అయినను నట్లు ప్రశ్నింపబడి నందుల కామెకు సంతోషమే కలిగెను. తన హృదయమందు లగ్నమై యున్న తన మనోనాథుని పేరు తెలియజేయ నవకాశము లభించెను. కాని యంగనలకు సహజమైన సిగ్గు ఆమెను కొంతసేపు బాధించెను. అయిన నామె యాయవకాశమును బోగొట్టుకొన దలచుకొనలేదు. తన యభిప్రాయమును దండ్రికి వెల్లడిజేసి, తన మనోభీష్టమును నెఱవేర్చుకొన నిశ్చయించుకొనియెను. చిఱునవ్వు నవ్వుచు ''తండ్రీ, యడిగితివిగాన జెప్ప దలచితిని. సాళ్వరాజకుమారు డగు సత్యవంతుని నేను వరించితిని'' అని క్లుప్తముగ బల్కి మిన్నకుండెను.

రాజప్పుడు మునివైపునకు దిరిగి, ''తాపసోత్తమా, దీనికి మీ యభిప్రాయమేమి?''యని యడిగెను. అందులకు నారదుడు ''రాజా! నీ కొమార్తె యెంతయు నదృష్టవంతురాలు. ఆ రాకుమారుని గుణగణనము నాకు గూడ మించిన పని. అట్టివానిని పెండ్లియాడుట మంచిదే. కాని వేఱొక విషయము గూడ నాకు దెలియును. చెప్పనిచో దోషమని చెప్పుచున్నాను. పెండ్లియైన యేడాదికి సరిగ సత్యవంతుడు మృతి నొందును'' అని యూరకుండెను.

పిడుగువంటి యీవాక్యము వినిన తరువాత నెవ్వరును మాటాడ రైరి. అందఱును స్తంభీకృతులైరి. తుదకు సావిత్రి ధైర్యము దెచ్చుకొని "నాయనా, విచారమెందులకు? హృదయపూర్వకముగ ప్రేమించిన సత్యవంతుని దప్ప నే నితరులను జేపట్టను. ఏ కీడు మూడినను సరే" అని దృఢముగ బల్కెను. అప్పుడు నారదు డందుకొని "అవును రాజా, సావిత్రియొక్క పుణ్యఫలముచే సత్యవంతుడు చిరంజీవియగు నవకాశములు గలవు" అని పలికి వెడలిపోయెను.

పుత్రికారత్నము యొక్క నిశ్చితాభిప్రాయమునకు మాఱుమాటాడలేక, నారదుని సత్యవాక్యములచే నుత్సాహపూరితుడై, అశ్వపతి పెండ్లిప్రయత్నములు జేయించెను. తరువాత నొక దినమున సబంధుమిత్ర పరివారముగ కొమార్తెను వెంటనిడికొని సాళ్వభూపతి కడకు బయలు దేరెను.

కాలవశమున నప్పు డా ద్యుమత్సేన మహారాజు పదచ్యుతుడై, కన్నులులేక, భార్యాపుత్రులతో గూడ నరణ్యావాసము జేయుచుండెను. ఆ దంపతులు, సతీయుతముగ దమ్ము దర్శింపవచ్చిన మద్ర దేశాధీశ్వరుని యర్ఘ్యపాద్యాదివిధుల గౌరవించిరి. అప్పుడశ్వపతి తన రాకకు గారణమును దెలియజేసెను. ద్యుమత్సేను డాశ్చర్యపడి "రాజా, మేమిప్పుడు కష్టపరంపరల ననుభవించుచున్నాము. మీ సుకుమారిని నా కొమారునకిచ్చి యేలకష్టపెట్టెదవు?" అనెను. అందులకు అశ్వపతి "రాజా, యట్లనకుము. నా కొమరిత నీ కొమారుని మనసార ప్రేమించినది. కష్టములు శాశ్వతములుకావు. తిరిగి యెన్నడైన మీ యదృష్టరేఖ బయల్పడ కూడదా?" అనియెను.

ద్యుమత్సేనుడు రాజువాక్యములు విని యుత్సాహముతో నుప్పొంగి, తన కొమారుని బిలిచి యన్నియు జెప్పెను. తరువాత శుభ

లగ్నమున సావిత్రీ సత్యవంతులకు బెండ్లియయ్యెను. అశ్వపతి యల్లునకును, కూతునకును విలువగల వస్త్రాభరణముల నిచ్చి, యాశీర్వదించి మరలిపోయెను.

# 3

తండ్రి తన కిచ్చిన యాభరణములను విలువైన వసనములను సావిత్రి దాచిపైచి యరణ్యావాసమునకు యోగ్యమైన నారచీరలను ధరించెడిది. అటులజేయుట కామె కేమాత్రమును గష్టములేదు. వృద్ధులగు నత్తమామలును, యువకుడగు భర్తయు వనవాసక్లేశము ననుభవించుచుండ నామెమాత్రము వెనుకంజవేయునా?

మఱియు ననుదినము నత్తమామలకు మర్యాదతో సపర్యలు చేయుచు వారి కెట్టికొఱతయు గలుగనీయక వర్తించెడిది. భర్తకుగూడ నట్టులే యుపచారము జేయుచు నాతని పదానువర్తియై సంచరించెడిది. వారందఱును నామె సుగుణసంపత్తికి నానందించెడివారు.

ఎన్నిపనులు చేయుచున్నను సావిత్రి నారదవాక్యమునుమాత్రము మఱవలేదు. తన పెండ్లియైనది మొదలు దినములు లెక్కించుచునే యుండెను. సంవత్సరకాల మిక కొద్ది దినములలో సమాప్తము నొందుటకు పూర్వ మొక వ్రత మామె యాచరింప ప్రారంభించెను. వ్రతదీక్షానుసరణముగ నామె మూడుదినము లుపవాస ముండవలెను. కానియామె కోమలత్వమును జూచి యత్తమామ లుపవాసము వలదనిరి. అయినను సావిత్రి వారిని బతిమాలికొని యొప్పించెను. వ్రతఫలితమును జూచినచో సంతసించెద రని చెప్పెను. వారును వల్లెయనిరి.

ఉపవాసశ్రమ మించుకేనియును లేక సావిత్రి మూడు దినములును గడపెను. నాల్గవదినమున, నుదయముననే పూజాపుష్పము

లను, వంటచెఱకును గొని తెచ్చుటకు సత్యవంతుడు వనమునకు బయలు దేరెను. వలదని యెంత వారించినను సావిత్రి యత్తమామల యను మతి బడసి నాథుని పదాబ్జాతంబుల వ్రాలి యాతని వెంట బయలు దేరెను. కాని సావిత్రికి దక్క నిందెవ్వరికిని గూడ నారద వాక్యము స్మృతిపథమున లేదు.

వనము లోపలకు బోయిపోయి, సత్యవంతుడు మిక్కిలి డస్సి, యొకచో వృక్షచ్ఛాయను విశ్రమించెను. అంతలో నప్పు డాతనికి మితి లేని శిరోభారము గల్గెను. సావిత్రి యాతని దొడపై నిడుకొని యుప చారము జేయుచుండెను. తన పెనిమిటికి మృత్యుకాల మాసన్నమైన దని యామెకు దెలియును.

ఇంతలో యమధర్మరాజు మృత్యుపాశములను జేతబూని యెదురుగ నిల్చెను. సావిత్రి యొడలు గడగడవడకెను. ఒక్కతుటిలో యముడు సత్యవంతుని ప్రాణములను గొని బయలుదేరెను. సావిత్రి సావిత్రీదేవికి మ్రొక్కి, యముని ననుసరించెను. అది గాంచి "సాధ్వీ మతల్లీ! నీ వెందులకిట్లు వెంటనంటివచ్చెదవు? మార్గము కష్టసాధ్యము. తిరిగిపొమ్ము" అని యముడు పల్కెను. అందులకు "ఆర్యా, యుత్తమ సాధ్వికి పతిపాదానుసరణము దక్క వేఱొండుమార్గ మేమున్నయది? అది నీవంటివారలకు దెలియని విషయము కాదు" అని సావిత్రి బదులుచెప్పి యమునివెంట నా కంటకావృతమైన యరణ్యభూముల జనఁ జొచ్చెను.

ఆమె దృఢసంకల్పమునకును, నద్వితీయమై వెలయుచున్న పతి భక్తికిని నాశ్చర్యానందమగ్నమానసుడై యముడు "నీ నాథుని ప్రాణములు దప్ప నితరవరము నేదైన కోరుకొనుము" అని యాన

తిచ్చెను. తత్క్షణమే "నా యత్తమామలకు నంధత్వము బాపి, వారికి తిరిగి రాజ్యమిప్పింపుము" అని సావిత్రి కోరెను. యముడు సావిత్రికి వరము ప్రసాదించి పోసాగెను.

వరము గైకొనికూడ సావిత్రి యముని వెంట బోవుచుండెను. అప్పుడు యముడు సావిత్రినిజూచి "అమ్మా, యిక రాకుము. నీకు మార్గమింకను దుర్లభమగును" అనెను. "దేవా, పుణ్యసతికి దుర్లభమైనపనియేది? భర్తను విడిచి స్త్రీ యెట్లుండ గలదు? సతీపతులను వేఱుచేయుట నీబోటివారికి దగిన పనియా? ఇట్టి దీనురాలికి పతిభిక్ష బెట్టుట నీకు ధర్మముకాదా?" అని దృఢముగ బల్కెను. అప్పుడు యముడు "దేవీ, యీ కోర్కెదక్క వేఱెయ్యది యైనను నెఱవేర్చెదను" అని బదులు చెప్పెను. "అట్లైనచో నా తండ్రియైన అశ్వపతికి నూర్గురు కొమారులను బ్రసాదింపుము" అనియెను. "అట్లే యగుగాక" యని యమధర్మరాజు నడచిపోసాగెను.

ఇంకను సావిత్రి పట్టువిడువక యముని వెంట నడచెను. వలదని యముడు ఆజ్ఞాపించెను. సావిత్రి వెనుకంజ వేయలేదు. "అయ్యో, యేలవచ్చెదవమ్మా! ఈ యుగ్రారణ్యమున రావలదు, రాజనదు. పో బాలా పొమ్మిక" అని యముడు తిరుగజెప్పెను. కాని సావిత్రి పట్టువిడువక "స్వామీ, నీబోటి వారిని నాశ్రయించినందులకు నాకు ఫలమేమి? నా కోర్కెను నెఱవేర్చి నన్ను రక్షింపవా? నీకంటె నాకు దిక్కెవరు, స్వామీ?" అని విలపించెను. యముని పాషాణహృదయము కరగినట్లయ్యెను. ఆయనహృదయము చలించెను. "పావనచరితా! సాధ్వీమణీ! అతీతమైన నీ పతిభక్తికిని, పెద్దలయెడఁ జూపు నిష్కళంక గౌరవమునకును సంతసించితిని. నీబోటి యుత్తమ స్త్రీరత్నముల వ్రతములును, సంకల్పములును, సిద్ధించక యెట్లగును? పుణ్యస్త్రీలు

సంకల్పసిద్ధులుకదా! నీ భర్త సజీవుడగును, పొమ్ము" అని పల్కి యముడామెను దీవించి యంతర్ధాన మయ్యెను.

# 4

సావిత్రి సంతోషముతో సత్యవంతుని కళేబరమున్న స్థలమునకు వచ్చెను. దీర్ఘసుషుప్తినుండి మేల్కాంచినవానివలె నాతడు లేచి కూర్చుండెను. ఆతని కంతయు వింతగ దోచెను. కాని సావిత్రిమాత్ర మాతని కేమియు జెప్పక, చాలతడవయ్యె నని యాశ్రమమునకు బయన మయ్యెను.

అచ్చటకు జేరుసరికి ద్యుమత్సేనుడును, భార్యయు, పునర్లబ్ధ నేత్రులై, సావిత్రీ సత్యవంతుల కొఱ కెదురు చూచుచుండిరి. ఇంతలో సాళ్వదేశీయులు వచ్చి ద్యుమత్సేనుని తిరిగి తమ పృథ్వీశునిగ రమ్మని వేడికొనిరి. అంతయు వింతగ నుండెను.

ఆ సమయమున సావిత్రి జరిగిన వృత్తాంతమంతయుఁ బూసగ్రుచ్చి నట్లు చెప్పెను. అత్తమామ లాశ్చర్యపడిరి. భర్త విస్మయపడెను. సావిత్రియొక్క వినయవిధేయతలకును, భయభక్తులకును, పుణ్య మహిమవిశేషమునకును, నందఱును సంతోషించిరి. తన నిర్మల జీవితము చేతను, తీవ్రనిశ్చయ వ్రతచర్యల చేతను, పతిసేవాపరత్వము చేతను, జీవితేశ్వరుని యమపాశములనుండి పునర్జీవితునిగ జేయగల్గిన సావిత్రి; యెల్లకాలముల వారికిని నాదర్శకస్త్రీరత్న మయ్యెనని లోక విఖ్యాతి వడసెను.

సహధర్మచారిణి యగు సతీరత్నమే, పుణ్యవతీ లలామ.

---

# ఎనిమిదవ కథ: * * * మీరాబాయి.

## 1

ఉత్తరహిందూస్థానమున నేటివఱకును మీరాబాయి గౌరవముతో స్మరింపబడుచున్నది. ఆమె రచించిన భక్తికీర్తనలు నేటికిని భక్తులచేతను, గాయకులచేతను, బిచ్చగాండ్రచేతను, గోపబాలురచేతను, పాడబడుచున్నవి. ఆమె భక్తినియమముల నిప్పటికిని ననుసరించువారు కొందఱు కలరు.

మీరాబాయి ఉదయపుర మహారాజు కొమార్తె. మీవారు రాణాయగు కుంభుని భార్య. పుష్పము పుట్టినతోడనే దాని పరిమళవిశేషము దెలియునట్లు పసితనమునుండియు మీరా, యీశ్వరభక్తి కలదై తన భావిజీవితవిధానమును చూచాయగ జూపగల్గెను. శ్రీకృష్ణుడామె ముఖ్యదైవము. ఆమె యాటపాటలెప్పుడును కృష్ణవిగ్రహము తోడనే జరిపెడిది. తోడి బాలబాలికలను తన చుట్టును జేరదీసి రాధాకృష్ణుల లీలానాటకముల నాడుచు కాలము గడిపెడిది.

రాణాకుంభుని భార్యయై మీవారుసంస్థానాధిదేవతయైనను మీరాదేవికి చిన్ననాటి కృష్ణభక్తియు, పూజాభావమును, క్షీణించలేదు. సకలైశ్వర్యములతోడను తులతూగు మీరా, యిప్పుడు తన రాజమందిరమునందే యొక రమ్యమగు కృష్ణమందిరమును నిర్మింపజేసెను. నవరత్నఖచితమగు సుందర కృష్ణవిగ్రహము నొకదాని నందుంచెను. అటులచేసి మీరా, యనుదినమును పెక్కండ్రు పరిచారికలతో గూడ భజనల జేయుచు, కీర్తనల బాడుచు, భక్తిపారవశ్యమున తన్నుదాను మఱచుచుండెను.

త్వరితగతి నామె యంతిపుర మొక పవిత్ర యాత్రాస్థలమయ్యెను. మీరాయంతటి యుత్తమ రాజ్ఞియే స్వయముగ కృష్ణభజన జేయుచుండ, నామె ననుసరించుచు గొందఱును, చూచి యానందించుచు గొందఱును, తీర్థప్రజవలె రాజమందిరమునకు మూగుచుండిరి. మహారాణా కుంభుని కిదియంతయు నెక్కుడు సమ్మతము గాక పోయినను, ప్రేమంపు భార్య యొక్క ప్రియకార్యమున కాటంకము గల్పింప సాహసింపలేదు.

## 2

అయినను, కాల మెప్పుడును నొక్కే రీతిని గడవబోదు. మానవుల బుద్ధులు మారుచుండును. అభిప్రాయములు భేదించుచుండును. కల యం దైనను గాంచని విషయములు సంభవించుచుండును. మీరాదేవి కీర్తిలత మీవారు రాజ్యముదాటి, రాజపుత్రస్థానము నధిగమించి, ఢిల్లీ వఱకును విస్తరించెను.

నాడు ఢిల్లీకి ప్రభువు అక్బరు ఫాదుషాహా. అక్బరు మహమ్మదీయుడైనను సాత్వికుడు. మతభేదములను పాటించెడి స్వభావము కాదు. అందఱకును దైవ మొక్కడేయని బోధించెడివాడు. మతసంబంధమగు కార్యములన్నను, పుణ్యజీవు లన్నను, తీర్థయాత్రికులన్నను, అక్బరున కమిత ప్రీతిగౌరవములు. క్రమముగ మీరా విషయ మాయన చెవుల బడెను. అప్పటినుండియు నాతని కెట్టులైనను మీరాదేవిని దర్శించవలె నను నిచ్ఛకలిగెను. రాజు తలచికొనినచో దేనికి కొఱత?

ఆస్థానకవి యగు టాన్‌సేన్‌తోగూడ అక్బరు హిందూయాత్రికుల వేషముదాల్చి దేవీ మీరా దర్శనార్థమై బయలుదేరెను. చిత్తూరు జేరి, వారు మురళీధర దేవాలయద్వారముకడ వేచియుండిరి.

ఆనాఁడు పూజాదినము. సేవానందలోల యగు మీరాదేవి, త్రైలోక్యపూజ్యుఁడగు శ్రీకృష్ణ పరమాత్ముని భజించుచు, పలువురు భక్తురాండ్రతోఁడ నచ్చోటికి వచ్చెను. భక్తిపారవశ్యమున మీరాబాయి మందస్మిత వదనారవిందయై, తేజోద్దీపిత నేత్రాంచలయై కన్పట్టెను. మూర్తీభవించిన భక్తిరాశివలె గన్పట్టు మీరాదేవిని కన్నులారఁ గాంచి, అక్బరు విస్మయానందములకు లోనై, పరవశత్వము నొందెను ఇంతలో మీరా, యాతని సమీపముగనే పోవుట సంభవించెను. ఆనందాతిశయమున, అక్బరు మణిహారము నొకదానిని దీసి, "మీ పరముగ సిద్ధానిని కృష్ణభగవానుని కర్పణముజేయుడు" అని మీరాదేవికి నందజేసెను. ఆమె దానిని విలోకించి "ఇట్టివి కృష్ణునకేల" అని సంశయసూచకముగ ననెను. "ఒకచో నాకీ హారము దొరకినది. సన్యాసినగు నాకు మాత్ర మిది యెందులకు? కృష్ణుని చెంతనే యుండనిండు" అని సమాధానము జెప్పి అక్బరు పాదుషా మరలిపోయెను.

## 3

ఎట్లెటో యీ విషయము కుంభునకు దెలియవచ్చెను. ఎవరో కపటసన్యాసి మణిహారము నొకదానిని మీరాకు కానుకగా నిచ్చి పోయెనని యనుమానమునకు లోనయ్యెను. ఆ మణిహారమును దెప్పించి, రత్నపరీక్షకులకు జూపించెను." మిక్కిలి విలువగలిగిన యిట్టి యాభరణము, అక్బరు సామ్రాట్టువద్ద తప్ప నితరులయొద్ద నుండవీలులేదు. ఇది యాతనిదే యైయుండవలెను" అని వారు చెప్పిరి. ఆ పలుకు వినినతోడనే కుంభునకు నగ్నిహోత్రమునం దాజ్యము పోసినట్లయ్యెను. మహమ్మదీయ మతస్థుడగు అక్బరు, మోసముజేసి తన భార్యముఖావలోకనము

జేసెనని యాతనికి నమితాగ్రహము గల్గెను. రాజపుత్రస్థానమునకు తీరని కళంకము వాటిల్లెనని కుపితుడయ్యెను.

"మీరాను రాజ్యమునుండి వెడలగొట్టుడు" అని రాణాయాజ్ఞ యయ్యెను. విచారముతో భటులా యుత్తరువును మీరాదేవికి తెలియజేసిరి. మీరా యప్పటికి సాయంసమయకృత్యములను నెర వేర్చికొని గోపీవల్లభుని పదకమలములను బూజించుచుండెను. ఆ ఘోర వార్త విని యామె యించుకేనియు జలింపలేదు. తన తప్పిదమేమి యని ప్రశ్నింపలేదు. రాణా, తొందరపడెనని కూడ శంకింపలేదు. అతని యాజ్ఞ యక్రమమని తలంపనైనలేదు. శరణు అని భర్తను వేడ బ్రయ త్నింపలేదు. రక్షింపుడని బంధువర్గమును కోరలేదు. ఇటుల సంభవించెను గదా! యని యశ్రువులేనియు రాల్పలేదు. సర్వమును కృష్ణనామోచ్చా రణయందు మఱచిపోయెను.

రాత్రియైనది. ఆ సాయంసమయమున జరిగిన విషాదగాథచే రాజమందిరము కళాహీన మయ్యెను. ఎచట జూచినను విచారమయమై కన్పట్టెను. ఎల్లెడలను గభీరమైన శాంతి నెలకొని యుండెను. అట్టితఱి మీరాదేవి ప్రయాణసన్నాహ మయ్యెను. వైరాగ్య సూచకములగు కాషాయవసనములు ధరించి, దేవతావర్చస్సు విరజిమ్మ నెమ్మో ముతో నామె తుదిమారు కృష్ణదైవతధ్యానము గావించి, కడసారి రాజమందిరమును వీక్షించి, వెడలిపోయెను. ఆ గాఢాంధకారమున నామెకు దైవముతప్ప వేఱెవ్వరును దోడులేరు.

పోయిపోయి, యామె యొక నదీకూలము జేరెను. భర్త యాజ్ఞను స్మరించి, మఱియొకమారు కృష్ణుని భజించి, యా ప్రవాహము నందు దూకెను. తదుపరి యేమి జరిగెనో తెలియదు. ఆమె కన్నులు

తెఱిచి చూచునరికి, నామె నదిగట్టున నుండెను. "ఇట్టిటుల సంభవించెను ? నేనింకను జీవించియుండి యీశ్వరసేవ జేయవలెనని కాబోలు భగవన్నిర్ణయము" అని గ్రహించి, మీరా యటనుండి బయలుదేరెను.

ఆ ప్రాంతమునందే యొక పెద్ద కృష్ణమందిర ముండెను. రూపగోస్వామి యద్దానికి గురువు. ప్రఖ్యాతిగాంచిన భక్తశిఖామణి యాతడు. అట్టివాని కడకు మీరా చేరుకొనెను. ఒకరిమహత్తు నొకరుగ్రహించిరి. రూపగోస్వామి యామెను మందిరమున నుండుట కాహ్వానించెను. ఆమెయు సంతోషముతో నందుల కంగీకరించెను. వారిచుట్టును మూగెడిభక్తులు, భక్తురాండ్ర లెక్కకు మేరలేదు.

కాలము గడచినది. బృందావనమున, పూజాగానములచే కృష్ణహృదయమును పల్లవింప జేయుచున్న మీరాదేవి నామము, నలుదెసల వ్యాపించెను. జనులు గుమిగూడి యామె దర్శనార్థము వచ్చుచు బోవుచుండిరి.

## 4

ఇచట నిట్లుండ చిత్తూరునందు రాణాకుంభుని జీవిత మంధకారమయ్యెను. కోపాతిశయమున భార్య నట్లాజ్ఞాపించెనేగాని యాతనికి మాత్ర మామెయందు ప్రేమలేకపోయెనా ? దయాదాక్షిణ్యములు శూన్యమాయెనా ? కాదు. ఆమె వెడలిపోయిన నాటినుండియు, నాతనికి గల్గిన మనోవేదనకు మేరలేదు. అట్టి వానికిప్పుడు మీరాదేవియొక్క కీర్తి విస్ఫూర్తి దెలియ వచ్చెను.

తత్క్షణమే రాణా బయలుదేరి బృందావనము జేరెను. పశ్చాత్తప్తహృదయముతో మీరా పాదములపై వ్రాలెను. భర్తను గుర్తించి యామె నివ్వెఱపాటుజెంది యట్లు చేయవల దని వానిని వారించెను.

"క్షమించినగాని లేవను'' అని కుంభుడు పట్టుబట్టెను. "అందఱను క్షమించువాడు కృష్ణభగవానుడున్నాడు'' అని మీరా మెల్లగ నుడివెను. అంతకంటె నధికముగ నామె మాటాడలేదు. రాణా తన కన్నీటిధారలచే నామె పాదములను కడిగెను. ''చిత్తూరునకు తిరిగి రమ్ము. నీకు వలసిన సదుపాయముల నన్నిటిని జేయించెదను'' అని దైన్యముతో వేడుకొనియెను. ''వలదు, వలదు ఇచ్చటను సౌఖ్యముగ నున్నది'' అని మీరా శాంతముగ బ్రత్యుత్తర మిచ్చెను.

తాను దెలియక చేసిన తప్పిదమునకు వగచి, యప్పటి నుండియు రాణాకూడ నొకభక్తు డయ్యెను. భార్యా ప్రవర్తన మాతనియందు గల్గించిన ప్రబోధమును, పరివర్తనమును నద్వితీయములు.

పరమపావని యగు మీరా యసామాన్యభక్తురాలు, ధన్య చరిత. ఆమె యాదర్శమున రాణాకుంభుడుకూడ ధన్యుడయ్యెను. 'యథా రాజా తథా ప్రజా' యని సామెత. పరిపాలకులే యతీతులైన భక్తులై వెలయుచుండ, పరిపాలితులు సైతము వారి యడుగుదమ్ములలో నడచి పరమభక్తులగుట యబ్బురము గానేరదు. కాలక్రమమున తన భక్తికిరణపుంజములతో మీవారు రాజ్యమునంతను పవిత్రవంతముగ జేసిన రాణీ మీరాదేవి, పరమపావన చరితయై, లోకవిఖ్యాతి గాంచెను.

పుణ్యస్త్రీల ప్రేరణప్రభావము అనిర్వాచ్యము.

మూడవ భాగము.

# ఒకటవ కథ: *** దేవహూతి దేవి.

## 1

మీరు దేవహూతి చిత్ర చరితము చదువకయుండినను, నామె పవిత్ర నామము వినకయుండినను, నదియొక గొప్ప లోపమే యగును. భారతదేశ సాధ్వీమతల్లులలో నొకర్తెగ పరిగణింపబడి ప్రధానాదర్శక స్త్రీ రత్నములలో నగ్రగణ్య యగు దేవహూతిపూతజీవితకథ చిరస్మరణీయము.

వేదకాలమునాటి పుణ్యపురుషులలో స్వాయంభువ మనువు పేరు గన్నవాడు. వాని కృతియగు "మనుధర్మ శాస్త్రము" నేటికిని భారత దేశముయొక్క ఉత్కృష్ట గ్రంథములలో నొకటియై యలరారు చున్నది. అట్టి యఖండమేధానంపన్నుని కుమార్తె దేవహూతి. పుట్టిన దాదియు మనువు తనూజపై యపరిమితానురాగమును జూపుచు విద్యాబుద్ధులను గఱపి పెంచుచుండెను. క్రమముగ వయస్సునందేగాక విద్యావినయములందుగూడ మిన్నయై చిఱుతప్రాయముననే దేవహూతి తండ్రికానందము నొసర్చెను. కాని యామె పెండ్లివయస్సు సమీపించుటచే మనువుయొక్క మనోవేదన యెక్కుడయ్యెను. తగినవరు డెచ్చటను గానరాక మనువు చింతాక్రాంతుడై కాలము గడుపు చుండెను.

కాని యెంతకాల మని యోపికపట్టుట. మార్గమేమియును గానక మనువు భార్యాసమేతుడై దేవహూతినిగూడ వెంటనిడుకొని పుణ్య క్షేత్రములను, పుణ్యతీర్థములను సేవించుటకై యాత్రకు బయల్వె

డలెను. అట్లుపోయి తుదకు వారు సరస్వతీనదిచెంతకు జేరుసరికి నిస్పృహ జెంది నిలువబడిరి. ప్రయత్నములన్నియు వ్యర్థములే కాబోలునని వారు హృదయతాపము ననుభవించుచుండ దూరమున నదీసైకతముల కావల సాంద్రతరులతాగుల్మములమాటున నొకానొక పర్ణశాల పొడసూపెను. అయ్యది ఋష్యాశ్రమ మని నిరూఢి చేసికొని తన్నివాసియగు తాపసోత్తముని సహాయముచే కష్టములు నివారించుకొనవచ్చునని సమాశ్వాసము చెందిరి. తరువాత నామనుదంపతులు కొమార్తెతో గూడ నాశ్రమ సామీప్యమునకు వచ్చి లోనజూచిరి.

అందొకమూల అజినాసనముపై తేజోమూర్తి యొకడు యోగసమాధియందు మగ్నుడై కూర్చుండియుండెను. తమరాకచే వానికి తపోభంగ మగునేమోయని సందియమంది వారు మెల్లన నచ్చటనే కూర్చుండిరి. కొంతతడవగుసరికి బాలభానుబింబము పగిది ప్రకాశించుచున్న ముఖమండలమును వికసింపజేసి యా తాపసి యతిథులను గాంచెను. వారును మునికుమారునికి నమస్కరించి యొదిగి నిలువబడి తమ పూర్వగాథను నెఱుకపరచిరి.

తాపసియు వారిని రాజదంపతులుగ గుర్తెఱిగి కుశల ప్రశ్నల నడిగి యుచితాసనముపై గూర్చుండజేసి యన్వేషణక్రమమును జెప్పుమనెను. వారును నందులకు సంతసించి తమవెనుక నొదిగి యొదిగి దాగుచున్న కుమార్తెను జూపి "మా దేవహూతికి పెండ్లి యీడు వచ్చినది. తగిన వరునికై యెన్నెన్ని స్థలములనో వెదకితిమి. ఎన్ని ప్రయత్నములనో చేసితిమి. అన్నియు నిష్ప్రయోజనములైనవి. మా యదృష్టవశమున మీ దర్శనభాగ్య మాయెను. కాబట్టి దయయుంచి మా కొమరితను భార్యగా గ్రహించి యనుగ్రహింపుడు" అని దీనముగ వాక్రుచ్చిరి.

## 2

ఆమునికుమారుడు దరహాసచంద్రిక లొలికెడి మోముతో "రాజా! నన్ను వరునిగ గోరుకొనిన లాభమేమి? ఈ కాననసీమల దిరుగుచు, నాకులను, నలములను, ఫలములను, దినుచు వేదాంతధోరణి గాలము గడపు నాబోటి వానికి నీ రాజకన్యక నిచ్చి పెండ్లిచేయుట యుక్తమా? రాజమందిరములో హంసతూలికాతల్పముపై భాగ్య భోగ్యముల ననుభవింపవలసిన రాచబిడ్డ నేల కష్టపెట్టెదరు? నే నీ యడవులయందు దిరుగాడువాడను. కర్దముడు నా నామము" అనెను.

'కర్దముడు' అను పేరు వినినతోడనే మనువు త్రుళ్ళిపడి "కర్దమ ఋషిసత్తమా! భక్తిజ్ఞాన వైరాగ్యములకు పిన్ననాటనే పేరువడసి, యాముష్మికానందమునకే పాటుబడుచు, దపోనిష్ఠాగరిష్ఠుడ వగు నిన్ను జూచిన కతమున నీ నాడుకదా మా జీవితములు ధన్యమైనవి! మాయందు కృపనునిచి దేవహూతిదేవిని భార్యగా స్వీకరించితివేని యెంతయు సంతసించెదము" అని సవినయముగ బల్కెను.

కర్దముడు మనువు పల్కుల కానందించి "రాజా, యంతగా నీవు చెప్పనక్కఱలేదు. దేవహూతిని బోలు ఉత్తమస్త్రీని పరిణయ మాడుటకు నా కెంతమాత్రమును సందియములేదు. కాని నేను గృహస్థాశ్రమ ధర్మమును నెక్కుడు కాలము నిర్వహింప జాలను. సంతానము గల్గిన వెంటనే నేను సన్న్యాసాశ్రమమును స్వీకరింపవలసి యుండును. అందులకు మీ రిచ్చగింతురేని నాకును నంగీకారమే" యని చెప్పను వమందానందకందళితహృదయారవిందుడై "తాపసోత్తమా! నీపల్కుల కెంతయు సంతసించితిమి. నీవెట్లు చేసినను సమ్మతమే. నిన్ను భర్తగా గ్రహించుటచే దేవహూతి యెంతయు నదృష్టవంతురాలు" అని వారామెవంక జూడ నామె సహజమగు సిగ్గుచే శిరము వంచి యుండెను.

అంతట మనువు తన భార్యతో గొంతతడవు ముచ్చటించి శుభస్యశీఘ్ర మ్మని యప్పటికప్పుడే ముహూర్తము నిశ్చయించి 'కన్యధార'కు గడంగెను. అదృశ్యదేవతాశీర్వాదములతో దేవహూతి కర్దములకు బరిణయమయ్యెను. వధూవరు లావృద్ధదంపతుల యాశీస్సుల నందికొనిరి. కొమార్తెను కర్దముని యాశ్రమమున నుంచి మనువు భార్యతో గూడ స్వదేశమునకు మరలి పోయెను.

కొంతకాలము జరగెను. దేవహూతికర్దమదంపతు లన్యోన్యాను రాగముతో సుఖజీవనము చేయుచుండిరి. ఒకానొక రాత్రి భోజనానంతరము కర్దముడు శయ్యపై బరుండి గవాక్షమునుండి చంద్రబింబమును దిలకింపుచుండ దేవహూతి పతిపాదము లొత్తుచుండెను. అట్టిసమయము లోన నేదియో తటాలున స్ఫురణకు వచ్చినవానివలె కర్దముడు భార్య నుద్దేశించి 'ఏమైన కావలసిన కోరుము. ఇంక త్వరలో తురీయాశ్రమమును స్వీకరింప దలంచుచున్నాను' అనెను. ఆమెయు నొక్కముహూర్త మాత్ర మూరకుండి "నాకేమియు నక్కఱలేదు. కోరదగిన దేదియును లేదు. కాని బిడ్డలు కల్గిన యనంతరముకదా! చతుర్థాశ్రమ స్వీకరణమని చెప్పుదురు" అని కొంచెము సిగ్గుతో నందిచ్చెను. వివేకవంతుడును, సత్యవాక్చరితుడును, నగు కర్దముని మఱేమియు జెప్పక మూకీభావము బూనెను.

మఱికొంతకాలము గడచెను. దేవహూతికర్దముల సంసారసుఖఫలితముగ వారికి తొమ్మండుగురు కుమార్తెలును, నొక్క కుమారుడును గల్గిరి. వారికి అరుంధతి, అనసూయ, శాంతి, శ్రద్ధ, క్రియ, గతి, హావిర్భువ, కరుణ, ఖ్యాతి, కపిలుడు, అని నామధేయము లిడిరి. బాలికలు దినదినప్రవర్ధమానలై త్వరితముగ వివాహవయస్సు సమీపింప, తల్లి

దండ్రులు వారికి బెండ్లిండ్లుచేసి యత్తవారిండ్ల కంపివైచిరి. కొమారుడు కపిలుడు మాత్రమే తల్లిదండ్రుల చెంత నుండెను.

కపిలుడు ఈశ్వరాంశసంభూతుడని నమ్మిక. బాలికలు కల్గిన కొంత కాలమునకు దేవహూతి భర్తతో పుత్రులు లేనిచో జన్మతరింప దందురు, అని యన్నట్లును, అప్పుడు కర్దముడామెను నారాయణ స్తవము చేయుమన్నట్లును తదుపరి యామె యట్లు చేసి కపిలుని బడసెననియు చెప్పుదురు. అది యెట్లైనను కపిలుడు పిన్ననాట నుండియు నత్యధికజ్ఞానసంపత్తి కలవాడై తల్లిదండ్రుల కానందము నొనగూర్చెడివాడు. వానియందనురాగమును భక్తి శ్రద్ధలను జూపుచు వారు వానిని బెద్దను జేసిరి.

కపిలుడు వయస్సు మీరి జ్ఞానచక్షువుతో బ్రకాశించుచుండ నొకదినమున తల్లిదండ్రు లిరువురును వానికి నమస్కరించి "కపిలా! పుత్రుడవయ్యును, నీవు మాకు గురుతుల్యుడవు. నీజన్మపథమున మాజన్మలుగూడ తరింపగలవు. కాబట్టి మాకు తురీయాశ్రమస్వీకరణమున కనుజ్ఞ నొసంగి, జ్ఞానబోధ జేయుము" అనిరి. కపిలుడు వారి కోరికను నెఱవేర్చెను. దేవహూతి కుమారు నుద్దేశించి 'పుత్రా! నీమూలమున నిజముగా లోకమునకు శ్రేయస్సు చేకూరకలదు. దేశమునందంతటను జ్ఞానరశ్మిని బ్రసరింపజేయుము"అని యాశీర్వదించెను.

అకుంఠితపతిభక్తయు, నిష్కల్మష సేవానిరతయు, ఆదర్శ స్త్రీ రత్నమునగు నాజవని వాక్కును కపిలుడు పాటించెను. నేటికిని కపిల వేదాంతసూత్రములు భారతేతిహాసములందు ముఖ్యస్థానము నలంకరించుచున్నవి. అట్టి మహాపురుషుని గన్నతల్లి యెంతయు పుణ్యస్త్రీయై స్మరింపబడుచున్నది.

# రెండవకథ: ⁂ నాగాంబ.

## 1

ప్రాచీనాంధ్ర ప్రాభవమును దెల్పెడి సీమలలో పలనాడు ముఖ్యమైనది. ఈ పలనాటి కొకప్పుడు నలగామరాజు ప్రభువు. బ్రహ్మనాయడను మంత్రియు, నాగాంబయను మంత్రిణియు, వానికి కుడి ఎడమ భుజములై రాజకార్యములను సమర్థతతో నిర్వహించుచుండిరి.

పురుషులు మంత్రిపదవుల నలంకరించుట సహజమే. కాని స్త్రీయైన నాగాంబకట్టి యున్నతపదవి యెటుల బ్రాప్తించెనని చదువరులకు సంశయము జనింపవచ్చును. నాగాంబ సుప్రసిద్ధ రెడ్లవంశమున నుద్భవించిన వనిత. తండ్రియగు చౌదరీ రామిరెడ్డియొద్ద నామె చిన్ననాటి నుండియు రాజ్యతంత్రములందు బరివేశముగల్గి ప్రావీణ్యమును సంపాదించెను. అందుచే నామెను నలగామరాజు సతతము సహాయురాలుగ జేసికొని రాజ్యమేలెను.

నాగాంబ రాజ్యతంత్రజ్ఞురాలు. సమర్థురాలు. బ్రహ్మనాయకునికిని నామెకు నొకానొకప్పుడొక రాజ్యాంగవిషయమున భేదాభిప్రాయములు గలిగినవి. అట్టితఱి ఆమె బ్రహ్మనాయనియందును వాని యధికార ప్రాబల్యమునందును నీర్ష్య కలిగియుండి యెట్టులైనను వానిని దన యెదుటనుండి తొలగించి రాజ్యమునుండి తఱుమగొట్టించుటకై సమయముకొరకు వేచియుండెను.

నలగామరాజు రాజ్యమునందే వాని పినతండ్రి కుమారుడగు మలిదేవరాజుకూడ నుండెను. వానిని జూచిన నాగాంబకు గన్నెఱ్ఱ. ఎట్లైనను వానిని దేశభ్రష్టునిగ జేయవలెనని యామె పట్టుదల. ఇది తెలిసి యామె దురుద్దేశమును విఫలపఱచుటకు బ్రహ్మనాయడు మలి

దేవరాజు పక్షమున జేరెను. అది మొదలు నాగాంబకు వారియందు పగయెక్కువయై, యనేక కుహనామార్గముల నాలోచించుచుండెను.

అంతట కోడిపందెమునకు రావలసినదిగా నాగాంబ యొక మాటు మలిదేవరాజునకు నాహ్వాన మంపెను. ఆ దినములలో కోడి పందెములు గొప్పవారి విలాసమేగాక, రాజచిహ్నముగ గూడ బరిగణింపబడెడివి అందుచేత నాహ్వానమును నిరాకరింపజాలక, మలిదేవ రాజు కోడిపందెమునకు సిద్ధపడెను. ఈ పన్నాగమున కంతకును నండయైన నాగాంబ వారిని దోడ్కొనిపోయి, పందెమునకు నుపక్రమించెను. ఆమెచేసిన మాయోపాయముచే మలిదేవరా జోడిపోయి, షరతు ననుసరించి, మాచర్లను విడిచి యేడేండ్లకాలము వలసపోవలసి వచ్చెను. తమకు గల్గిన కష్టమునకును, నాగాంబ దుష్కృత్యమునకును, మలిదేవ బ్రహ్మనాయకులు ఖిన్నులైరి. కాని చేయునదిలేక సపరివారముగ మాచర్లను విడిచి వేటకోక పట్టణమున నుండిరి.

అచ్చట నేడేండ్లును ముగియగనే తన రాజ్యభాగమును దన కిమ్మని మలిదేవరాజు రాయబారమంపెను. కాని నాగాంబ యా దూతను క్రూరముగ హింసించెను. అది విని సౌమ్యపద్ధతులకు నాగాంబ సమ్మతింప దని యాతడు యుద్ధమునకు సన్నద్ధుడయ్యెను. నలగామరాజును, నాగాంబయును గూడ సైన్యములను సిద్ధపఱిచిరి. ఇరుపక్షముల వారును నెదుర్కొని ఘోరయుద్ధము సల్పిరి. బ్రహ్మనాయని కుమారుడను, మహావీరుడు నైన బాలచంద్రుడు, మలిదేవ రాజు పక్షమున నాయకత్వమును వహించెను. నలగామరాజు వైపున

నాగాంబ స్వయముగ ఖడ్గముబూని, నాయకురాలై సేనలను నడిపించెను. అందుకనియే యామెకు నాయకురాలని కూడ పేరు కలిగినది.

నాయకురాలైన నాగాంబ, యా పల్నాటి యుద్ధమును స్వయముగ సాగించిన దని తెలిసికొని నపుడు, ఎంతసాహసము, ఎంత శౌర్యము, ఎంత చాకచక్యము, ఎంతటి మేధాసంపత్తి, యెంతటి యుద్ధకౌశలము, ఆమె కలిగియున్నదో మనకు స్పష్టపడును. నవనాగరకత ప్రబలినట్టి యీ దినములలోగూడ, శస్త్రాస్త్రములను బూని యుద్ధముచేయుట మనము వినియుండలేదు. అట్టితఱి, పండ్రెండవ శతాబ్దమున నొక స్త్రీ, యొక మహా సంగ్రామమును గొనసాగించిన దనినచో నెంత ఖ్యాతియో యోచింపుడు. అట్టి నాగాంబ యాంధ్రవనిత. ఆమె వలన పల్నాటి చరిత్రయేగాక, యాంధ్రేతిహాసమంతయు గూడ బునీతమై, ప్రఖ్యాతి గాంచినది.

ఆమె కుట్రాలోచనలు చేసిన జేయుగాక, అన్యాయాపరురాలై మెలగిన మెలగుగాక; కావలసినవారిని రాజ్యమునుండి వెడలగొట్టిన గొట్టుగాక. నాగాంబయొక్క రాజ్యతంత్రజ్ఞతా చతురత, కార్యదక్షత, పట్టుదల, సాహస శౌర్యములు, మేధాసంపత్తి, యుద్ధకౌశలము, వీర లక్షణములు — అనన్యసామాన్యములు, అభినందనార్హములు. వీర వనితామతల్లియై యాంధ్రప్రశస్తిని విస్తరింపజేసిన నాగాంబ పావన చరిత.



# మూడవ కథ: ⁂ చారుమతీదేవి.

## 1

పతివ్రతారత్నములైన సీత, సావిత్రి, చంద్రమతి, మున్నగు వారితో దులదూగు యశోధనము నార్జించి, పుణ్య స్త్రీ లోకమున "గగనతల విభాసిత తారకల విధాన" వెలుగొందు మహనీయురాంద్రలో చారుమతీదేవి యొకతె. పతియే దైవమని నిశ్శంకవిశ్వాసముతో నెల్లవేళల భర్తృపదసేవానురక్తురాలై, పుణ్యప్రభావముచే స్వప్నము నందు వరలక్ష్మీదేవిని సాక్షాత్తు కన్నులారగాంచి, మోక్షమార్గము నంటి జీవిత వాహినిని నడిపించిన యోగ్యురాలు చారుమతీదేవి.

ప్రాక్తన భారతవర్షమున పేరెన్నిక గాంచిన రాజ్యములలో కుండినపుర మొకటి. ఒకానొకప్పు డా పట్టణమున కౌండిన్యుడను బ్రాహ్మణోత్తముడు, చారుమతి యను భార్యారత్నముతో నిష్ఠా గరిష్ఠుడై జీవితము సాగించుచుండెను. తల్లిదండ్రుల గృహమునువీడి గృహస్థాశ్రమమును జేరినప్పటినుండియు, చారుమతి భర్తయెడ నపరిమిత వినయవిధేయతలతోడను, ఆదరణానురాగములతోడను మెలగుచు వారికి దోడునీడయై సంచరించుచుండెను. మఱియును, నామె పేరునకు దగినట్లు మంచి బుద్ధిగలదియై, సుగుణరాశియై, జ్ఞానసంపన్నయై, పతికెంతయో యానందము గూర్చుచుండెడిది.

చారుమతీదేవికి వేఱు పనిలేదు. వేఱు యోచనలేదు. నిత్యమును బ్రత్యూషమున నే లేచి భర్త పాదారవిందములను గన్నులంటి నమస్కరించి నిర్మలసలిలములందు స్నానమాడి కలకలలాడు మోముతో భర్తకు జపహోమాది కర్మలకు వలసిన వస్తువుల నన్నిటిని జేకూర్చి, యింటి కార్యములను నిర్వర్తించి, భర్తకు నను వైన

భోజనపదార్థములను సిద్ధముచేసి, యుచ్ఛిష్టమును దాను భుజించెడిది. అనంతరము, మధ్యాహ్న కాలమంతయు భర్త గావించెడి కావ్యపఠనముతోడను, వేదాంత చర్చతోడను గడిపెడిది. ఈ విజ్ఞానగోష్ఠీ సమావేశమున కా ప్రాంతమునందలి యుత్తమ స్త్రీ లందఱును విచ్చేసి, కౌండిన్యుని వాగమృతమును గ్రోలి, చారుమతీదేవియొక్క సౌహార్దాతిథ్యములఁ దృప్తిగాంచి, సంతుష్టాంతరంగులై పోవుచుండెడివారు. ఆ పరిసరములవా రందఱకును, చారుమతీ కౌండిన్యులు ఆదర్శప్రాయులై యత్యంతగౌరవప్రదులై యుండెడివారు.

తన సహచారిణీ ధర్మ నిర్వహణముచేతను, పాతివ్రత్య భాగ్యముచేతను, చారుమతీనారీలలామ మానవ స్త్రీల దృష్టినే గాక, దేవతా స్త్రీలను గూడ నాకర్షించెనన్నచో నాశ్చర్యము లేదు.

## 2

శ్రావణమాసమునం దొకానొక జయవారమునా డామె దిన చర్యయంతయు ముగించుకొని, రాత్రి తుదిమారు పతిపాదకమలముల నొత్తి యద్దుకొని పరుండెను. అర్ధరాత్ర సమయమున నామె కన్నెదుట నొక దివ్యదృశ్యము గోచరించెను. చుట్టునున్న ప్రదేశమంతయు సుందరధగద్ధగితకాంతులచే మెరసెను. అపూర్వ దర్శనము. సాక్షాత్తు వరలక్ష్మీదేవియే, సర్వాభరణకాంచన వస్త్రాలంకృతయై చారుమతీదేవికి బ్రత్యక్షమయ్యెను. అప్పుడామె కంపితహృదయయై నిలువబడ, దేవి 'పతివ్రతా తిలకమా! భయమొందకుము. నీపతిభక్తికి మెచ్చి, నీకు వలసిన వరము లిచ్చి, యాశీర్వదింప వచ్చిన వరలక్ష్మీదేవిని. నీకోర్కె దెల్పుము'' అని కరుణారస ముప్పతిల్లునట్లుగా బల్కెను. అప్పటికి చారుమతీదేవికి గొంత స్థాయిచిక్కెను. "లోకజననీ! కరుణామయీ! నీహృదయమెంత విశాలమైనది! నే చేసిన

యల్పకార్యములే నీదృష్టి నాకర్షింపగల్గెనా! నీదివ్యదర్శనప్రాప్తిచే మా కుటీరమేగాక జీవితమంతయు గూడ ధన్యతజెందినది. నేను కోరదగిన ప్రత్యేక వరము లెవ్వియును లేవు. ఎప్పటివలెనే నన్ను నీకన్నుసన్నల మెలగనిచ్చుచు, నీ కరుణాకటాక్షవీక్షణములను నాపై బఱపుచుండుము. అంతియచాలును'' అని సవినయముగఁ బల్కుచు దేవి పాదముల నంటిమ్రొక్కెను. లక్ష్మీదేవి యామె నాశీర్వదించి లేవనెత్తి ''నారీరత్నమా! నీయొక్క నిష్కల్మషహృదయమునకు నేనెంతయు సంతసించితిని. నీవంటి మహనీయురాండ్రను జూచిన మాకెంతయో యానందము. మీబోంట్ల నందఱను మా తోబుట్టువులవలెనే పరిగణింతును. నీకు శాశ్వత సౌఖ్యసంపదలు గల్గుగాత!'' యని దీవించి యంతర్హితురాలయ్యెను.

తెల్లవారిన తరువాత ఆవిచిత్రానుభవమును చారుమతీదేవి భర్తతో జెప్పెను. ఆతడును భార్యయొక్క సుగుణభాగ్యమున కచ్చెరువొంది తనకు లేనిభాగ్య మామెకు గల్గినందుల కెంతయో శ్లాఘించెను. ఎట్టులో యీ దేవీదర్శనభాగ్యవార్త యా ప్రాంతమందంతయు బాకిపోయెను. ఎల్లరును వచ్చి చారుమతీదేవిని దర్శించి, నిజవృత్తాంత మెఱింగి యామెను మిక్కిలి కొనియాడి వెడలిపోవుచుండిరి. చారుమతీ కౌండిన్యుల పర్ణశాల యప్పుడొక యాత్రాస్థలమయ్యె నన్నచో నతిశయోక్తి కానేరదు.

ఆదినము మొదలు చారుమతియింట సమృద్ధిదేవత తాండవమాడుచుండెను. పాడిపంటలును, ధనధాన్యములును నాశ్చర్యముగొల్పు నభివృద్ధిగాంచెను. ఇంటినిండ నెల్లవేళలను నతిథిదేవతలు కలకలలాడుచుండిరి. గేహమంతయు వేదఘోషతో ప్రతిధ్వనించుచుండెను.

ఈ యపూర్వానుభవమునుగాంచి చుట్టుప్రక్కల స్త్రీ జన మంతయు వరలక్ష్మీవ్రతమునకు గడంగిరి. తాము గూడ చారుమతీ దేవివలెనే పుణ్యకార్యముల చేతను, పతిభక్తి పరాయణత చేతను, ఈశ్వరకృపనుబొంది, తన్మూలమున శాశ్వత యశస్సు నార్జింప నాతు రతపడిరి. 'పుణ్యై ర్యశో లభ్యతే' యని యార్యోక్తి.

ఇట్లల్పకాలములోనే చారుమతీదేవి మూలమున నా ప్రాంత స్త్రీ లందఱును వరలక్ష్మీభక్తురాండ్రై, యా దేవిని నిత్యమును నారాధించుచు, సిరి సంపదలను మిక్కుటముగఁబొంది యానందించు చుండిరి. చారుమతీదేవియు, నాటి నారీబృందమున కంతకును మకు టమై, దివ్యతమమైన పుణ్యజ్యోతితో వెలుగొందుచు, నిత్యధ్యాన లీల యందే కాలము బఱపుచు, జీవితమును దరింపజేసికొనెను.

---

# నాలుగవ కథ: ⁂ సుకన్య.

## 1

అనసూయ, అరుంధతి, త్రిలోకసుందరి, దమయంతి, చంద్రమతి, మొదలుగాఁగల పతివ్రతారత్నములతో సమానముగ వెలతూఁగు విఖ్యాతిని సంపాదించిన సుకన్య, భారత పతివ్రతామతల్లులలో నొకతెయై యలరారుచున్నది. ఒకానొక మహారాజు బిడ్డయైనను, విధిప్రేరణమున నొకానొక మహామహుని భార్యయై శాశ్వత సమాఖ్యనార్జించిన సుకన్య ధన్యురాలు.

సుకన్య శర్యాతి మహారాజు అనుంగు బిడ్డ. లేక లేక కలిగిన యీ బాలికామణిని జననీజనకులు, అవిరళానందాతిశయముతో సకల సద్గుణరాశిగ బెంచుచుండిరి. అట్లా బాలిక తల్లిదండ్రుల కటాక్షచ్ఛాయల దిరుగాడుచు, స్త్రీజన శ్రేయోదాయకములగు నీతిమార్గములను దెలిసికొని వర్తించుచుండెను.

ఆ విధముగ సుకన్య బాల్యలీలలయందు నూగాడుచు, నొకానొక దినమున, నుద్యానవనమున దిరుగాడుచుండెను. ఆటల మధ్య పుష్పాపచయమునకై యొక పొదయొద్దకు బోవ, నందుండి రెండుజ్యోతులు ప్రకాశింపజొచ్చెను. అదేమియో తెలిసికొనఁగోరి, యామె పుల్లతో బొడిచెను. 'హా' యను ఆర్తనాదము వినబడినంతనే సుకన్య భీతావహురాలై చెలికత్తెలతోఁగూడ వెనుదిరిగి చూడకుండ పలాయిత యయ్యెను. ఆ క్షణమునుండియు దేశమునం దొకవిధమగు జాడ్యము ప్రబలెను. ఎందఱో ప్రజలు పీడింపబడసాగిరి. రాజాంతఃపురస్త్రీలుకూడ నా విపరీత వ్యాధికి లోనైరి. పట్టణమంతయు

సంక్షోభము. ఎచ్చట జూచినను వ్యాధిపీడితులు. ఈ దుర్భర దృశ్యమునుజూచి రాజులకేమియు దోచక, నాతడు జ్యోతిష్కులను, బండితులను పృచ్ఛచేసెను. కాని యెవ్వరికిని కారణము గోచరింపలేదు.

ఈ వైపరీత్యమునంతను దిలకించుచున్న సుకన్య, యొకవేళ తాను తోటయందు దెలియక చేసిన కృత్యమేమైన కారణమై యుండ వచ్చునేమో యను సంశయముతో, తండ్రికి జరగిన యుదంతమంతయు జెప్పెను. అప్పు డాతను కొమార్తెను వెంటనిడుకొని, పరివారముతో పొదకడకు వచ్చి పరిశీలింపగా, నందొక ఋషిసత్తముడు తపోనిమగ్నుడై యుండెను. వానికి దన కొమార్తెవలన నపరాధము జరగి యుండవలెనని గ్రహించి, శర్యాతిరాజు, ఆ మునిపుంగవునకు సాష్టాంగపడి "ఆర్యోత్తమా, యిప్పుడు నా పట్టణమం దొక విచిత్ర వ్యాధి ప్రబలియున్నది. కారణముగాని, నివారణోపాయముగాని తెలియదాయె. మమ్ములను రక్షింపుడు" అని వేడుకొనగా, నాతడు "రాజా! నీ కొమార్తెయగు సుకన్య సౌందర్యగర్వాతిశయమున నాటలాడుకొనుచు, నా కన్నులను బొడుచుటచే నేను గ్రుడ్డివాడనైతిని. ఆ కారణమున నీ రాజ్యమున వ్యాధి ప్రబలినది. నీ బిడ్డను నాకిచ్చి వివాహము చేసితివేని యంతయు సవ్యముగ నుండును. నా పేరు చ్యవనుడు" అని బదులు చెప్పెను. ఆ మునివాక్యములు రాజుయొక్కయు, పరివారము యొక్కయు హృదయములను స్తంభింపజేసెను. "పదునాఱేండ్ల కన్యక; అష్టైశ్వర్యములతో దులదూగు కన్యక, హంసతూలికా తల్పములందు నలరారు కన్యక; ఇట్టిలేమ శుష్కించి శల్యమైన మునిని గట్టుకొను టెట్లు?" అని వారి సంశయము.

## 2

అంతయు గమనించినది సుకన్య; వెంటనే తండ్రివంక దిరిగి "తండ్రీ! ఆలోచించిన ప్రయోజనములేదు; ఋషివాక్యము లనుల్లంఘనీయములు; తపోధనుడైన యీ చ్యవన మహర్షియొక్క భార్య నగుటకంటె నాకు వేఱు భాగ్యమేమి కలదు? కావున, సంశ యింపక వెంటనే నన్ను వీని కిచ్చి వివాహముచేసి, ప్రజలను రక్షిం పుము'' అని గంభీరముగ బల్కెను. చేయునదిలేక రాజు వల్లెయనెను.

మహావైభవముతో శర్యాతి తన కుమార్తెను చ్యవనమునికిచ్చి పెండ్లిచేసి పంపివైచెను. ఆ నూతనదంపతు లాశ్రమము చేరుకొని, యచ్చట నిరంతరభగవన్నామసంకీర్తనము నందును, పుణ్యకథా కాలక్షేపము నందును, నీశ్వరధ్యానము నందును, గాలము నానంద ముతో గడపుచుండిరి. సుకన్య తన పూర్వపు సౌఖ్యములనుగాని, రాచ ఱికమునుగాని తలపోయక, యంధుడైన భర్తనే దైవముగ భావించి, సకలోపచారములను సవ్యముగ నొనర్చుచు, స్వర్గతుల్యసౌఖ్యము ననుభవించు చుండెను.

కాల మీ విధముగ జరగిపోవుచుండ, నొకానొక దినమున సుకన్య యాశ్రమోద్యాన వనమందు పుష్పములను సేకరించుచుండెను. ఆ సమయమున అశ్వినకుమారు లాకాశమార్గమున బోవుచు, నవ యౌవన విలాసవతి యగు సుకన్యనుగాంచి, ముగ్ధులై, యామెవద్దకు వచ్చిరి. ఆమె వారికి సమస్కరించి 'రాగతం బేమి' యని సవినయముగ నడిగెను. అంత వారు తమ హృదయకాంక్షను వెలిబుచ్చ సుకన్య వారి మదాంధతకు విచారించి మరలి పొమ్మనెను. కాని వారు పట్టు వీడకయుండుటచే, శపించెద నని యామె తీవ్రముగ బల్కెను. అంతవారు

భయకంపితులగుటయేగాక, జ్ఞానోద్దీపితులు కూడనైరి. ఆమె శౌశీల్యమును, పాతివ్రత్యమును మెచ్చుకొని తమ కృతజ్ఞతా సూచకముగ నామె భర్తయగు చ్యవనుని పునర్లబ్ధనేత్రునిగ జేసి వెడలిపోయిరి.

# 3

సుకన్య యాశ్రమమునకు వచ్చి, నవయౌవన రూపునును, విజ్ఞాన తేజోవిలసిత నేత్రుడును నగు చ్యవనునిగాంచి హర్షోత్కంఠయై, జరిగిన వృత్తాంతము సవిస్తరముగ విన్నవించెను. ఆమె పాతివ్రత్యమాహాత్మ్యమునకు చ్యవనుడు మెచ్చుకొని యామె భక్తి శుశ్రూషలను వేనోళ్ల కొనియాడెను.

అట్లు వారు తమ జీవితకాలమందొక నవరసభరితనూతన ఘట్టము ననుభవించుచుండ, శర్యాతిరాజు అల్లుని, కూతును, జూచుటకై విచ్చేసెను. భార్యాభర్త లిర్వురును వానికి నర్ఘ్యపాద్యముల నిచ్చి గౌరవించిరి. అప్పుడు శర్యాతి యల్లుని గుర్తింపనేరక, యెవరో యౌవను డుండుటజూచి విస్మయపడెను. అది కనిపెట్టి సుకన్య జరగిన యుదంతము నంతయుజెప్పెను. అప్పటికిని రాజునకు నమ్మిక కుదరక, కొమార్తెను దూషింపసాగెను. అంత చ్యవనుడు "రాజా, యొక యజ్ఞమును జేయుడు. అక్కడి కేతెంచు దేవతలచే మాయీబాంధవ్యమును ఋజువు చేయించెదను" అనగా నల్లెయని యాతడు వెడలిపోయెను.

శర్యాతిరాజు యజ్ఞమునకు దేవతలందఱు నేతెంచిరి. అశ్వినకుమారులుకూడ నరుదెంచిరి. కాని వారు వైద్యులగుటచే వారు తమతోబాటు సమాన గౌరవమును బొందరాదని ఇంద్రుడు వాదింప చ్యవనుడు, అశ్వినకుమారులకు కృతజ్ఞుడు గావున వారిపక్ష మవలం

బించి, ఇంద్రునితో వాదించెను. తుదకు వాదన తీవ్రరూపముదాల్చ చ్యవను డొకానొక రాక్షసుని సృష్టించి ఇంద్రు నక్కడినుండి పారి దోలించెను. వాని ప్రతిభావిశేషమున కందరును నచ్చెరు వొందు చుండగా, అశ్వినులు "ఆర్యవరా! చ్యవనమహాముని నూతనోజ్జీవమునకు మేమే కారకులము. ఈతడు చ్యవనుడు. ఈమె వాని భార్యయగు సుకన్య. సంశయింప బనిలేదు'' అని వాక్రుచ్చిరి. అంతట శర్యాతి తన యవివేకమునకు బశ్చాత్తాపపడి కొమార్తెను, అల్లుని నభినందించెను. సుకన్య యొక్క సౌశీల్యమును, పాతివ్రత్యమాహాత్మ్యమును నిష్టా గరిష్ఠతను, ప్రస్తుతించెను.

---

# అయిదవ కథ ⁂ సంగనాచి.

## 1

దక్షిణదేశమున నున్న కాంచీపురమును రాజధానిగ జేసికొని పూర్వమొకానొకప్పుడు చోళరాజులు ప్రభుత్వము చేసిరి. అట్టివారిలో కులోత్తుంగచోళుడు అఖండ దిగ్విజయమును బొంది నేటికిని చరిత్ర యందు స్మరింపబడుచున్నాడు.

ఈ కులోత్తుంగచోళునికిని వాని భార్యయగు చంద్రకాంతకును బెక్కు సంవత్సరములు సంతానప్రాప్తి లేదు. వారి పరిపాలనలో దేశము సకలైశ్వర్యముల ననుభవించుచుండెను. ప్రజలు సంతతానంద తరంగమాలికలలో నోలలాడుచుండిరి. రాజ్యమునందు మిత్రద్రోహము లేదు. శత్రుభయములేదు. అట్టి యానందవర్ధితులగు రాజదంపతులకు గూడ సంతానములేమిచే సంతోషములేదు.

మనోవాంఛాసిద్ధికై వారెన్నియో పుణ్యతీర్థములను సేవించిరి. ఎందఱు దేవుళ్లకో మ్రొక్కిరి. ఎన్ని దానములనో చేసిరి. ఎన్ని దేవాలయములనో కట్టించిరి. తుదకు కామాక్షీదేవి కటాక్ష వీక్షణ ప్రసారంబుచే వారికి సంగనాచి యను ముద్దులతనయ యుద్భవించెను.

'సంగనాచి' యనగా చాతుర్యము కలదని యర్థము. పేరునకు దగినట్లుగనే, యా రాజపుత్రిక పిన్ననాట నుండియు నీడునకు మించిన తెలివితేటలు గలదై, తల్లిదండ్రుల కమితామోదమును సమకూర్చుచుండెను. వారును నా బాలిక విజ్ఞానాభివృద్ధికై సమర్థుడగు గురువును నియమింప, వానియొద్ద సంగనాచి సకలవిద్యలను నతిచాకచక్యముతోడ నేర్చుకొనుచుండెను. ఆ దినములలో నొకనాడు సంగ

నాచి గురువును జూచి "బిందువు [o], అర్ధబిందువు [c] వేనిని బోలి యున్నవో తెల్పుడు" అని యడిగెను. అందుల కాతడు ప్రత్యుత్తర మీయలేక నివ్వెఱజెంద నామె తండ్రినిగూడ నడిగెను. ఆయనయును నశక్తతను దెల్పగా సంగనాచి 'సున్న యుంగరమును, నఱసున్న చంద్రరేఖను బోలియున్న' వని చెప్పగా, సందఱును నామె బాల విజ్ఞానశక్తికి నచ్చెరు వొందిరి.

ఆ విధముగ సంగనాచి విశేషకుతూహలముతో నుపాధ్యాయులయొద్ద విద్య నభ్యసించుచు, బండ్రెండవ వత్సరము వచ్చుసరికే, సంస్కృతాంధ్రములందు ప్రావీణ్యమును, పురాణేతిహాసశాస్త్రాదుల యందు బాండిత్యమును గడించెను. అందుచే సంగనాచియొక్క విద్యావైదుష్యము, పాండిత్య ప్రకర్ష, యుక్తివాదములు, దేశమందంతటను వ్యాపించెను. అట్టి యువతీరత్నమును జేపట్టుటకై యెక్కడెక్కడి రాజకుమారులును నువ్విళులూరుచు, రాయబారముల నంపసాగిరి.

ఈ విషయమున సంగనాచి తన యంతటి విజ్ఞాన సంపత్తిని సముపార్జించిన వానినిగాని వివాహమాడ నని, తండ్రితో జెప్పెను. తమ మనోవాంఛ నీడేర్చుకొన సంసిద్ధులై వచ్చిన రాకుమారు లందఱును గూడ నామెయొక్క చిత్రప్రశ్నలకు దగు సమాధాన మీయజాలక, ఖిన్నవదనులై మఱలి పోవుచుండిరి, ఈ వైపరీత్యమును బ్రజలు నింతగ జెప్పుకొన సాగిరి; పండితులు దర్కింప మొదలిడిరి; కాని సమస్యా పరిష్కారమునకు మార్గ మగుపడలేదు.

## 2

ఈ సమయమున పిన్న వయస్కుడును, రూపవంతుడును, విజ్ఞానశేఖరుడును నగు కుమారవర్మ యను రాజు, మహాబలిపురమును

బాలించుచుండెను. సంగనాచి యడుగు ప్రశ్నలకు సమాధానముచెప్పి యామెను పరిణయ మాడుటకు స్థిరసంకల్పుడై యాతడు కులోత్తుంగ చోడునికి వర్తమాన మంపెను. కులోత్తుంగుడు వాని నాహ్వానించి, గౌరవముతో నంతఃపురమునకు దోడ్కొనిపోయి, కుమార్తెకు గబురంపెను.

మధ్య తెర యడ్డుగాగ, సంగనాచి యిట్లడిగెను. "చెట్లమీద నివసించును గాని పక్షివర్గమునకు సంబంధించినది కాదు; మూడు కన్ను లుండును గాని శివుడుకాడు: చర్మమును ధరించును గాని సోమయాజి కాడు. నీళ్ళుండునుకాని కుండకాదు. మేఘముకాదు. అయ్యది యేమిటి?"

ఆ సమస్య విని కుమారవర్మ యొక్కనిమేషమాత్రమే యోచన జేసి "టెంకాయ" యని బదులుచెప్ప నామె సంతోషాంతరంగయై సిగ్గుతో దలవంచుకొనెను.

అంత కుమారవర్మ యామె నొక ప్రశ్న యడిగెను. "నల్లని కొండమీద నివసించునదియు, రక్తమాంసములను దినునదియు, మనుష్యులకంటె నుత్తమమైన స్థానమునం దుండునదియు నెయ్యది?" ప్రశ్న విని సంగనాచి చిరునగవుతో "పేను" అని ప్రత్యుత్తరమీయగా రాకుమారు డత్యానందభరితు డయ్యెను.

ఇట్లిరువురును నొకరి చాతుర్యమున కొకరు సంతసించి పెండ్లి కొప్పుకొనగా కులోత్తుంగచోళుడు వారికి దివ్యవైభవముతో గల్యాణ మహోత్సవము గావించెను. అనంతరము కుమారవర్మ భార్యతోగూడ స్వస్థానమగు మహాబలిపురముజేరి యతివైభవముతో దాన ధర్మములను చేయుచు సంతానమును బడసి రాజ్యకార్యములను నిర్వహించుచుండెను.

# 3

అట్లుండ వాని దానపరత్వమును శివుడును, విష్ణువును, కుమారస్వామియును బరీక్షింపనెంచిరి. ఒకానొక సమయమున కుమారవర్మ వేటకై కాంచనస్యందన మధిష్ఠించి పయనమై పోవుచుండెను దూరము చనగా బ్రాహ్మణరూపియగు శివుడు నమస్కరించి యాచించెను. దానధర్మములే శ్వాసనిశ్వాసములుగాగల కుమారవర్మ వానిని గనికరించి యేమి కావలెనని యడుగగా నా మాయాబ్రాహ్మణుడా రథమును గోరెను.

వెంటనే రాజు దాని నిచ్చివైచి వెడలిపోయెను. ఈ పరీక్షయందు నెగ్గినాడుగదా యని మఱియొకమారు విష్ణువు మాయారూపమున వచ్చెను. ఆసమయమున కుమారవర్మ పట్టపుటేనుగునెక్కి పోవుచుండెను. బ్రాహ్మణుని కోరిక నెఱవేర్చుటకై రాజు ఆ గజరాజమును వాని కిచ్చివైచెను.

ఈ విధముగ నెడతెగని దానధర్మములవలన రాజనేక కష్టములకు లోనయ్యెను. వాని నిస్సహాయస్థితి గుర్తెఱింగి, శత్రువులు పైబడి కుమారవర్మను మహాబలిపురమునుండి వెడలగొట్టిరి. ఎట్టి మనోవైకల్యమును జెందక రాజు భార్యాపుత్రులతో గూడ నడవుల నివసించుచుండెను

ఇంకను వాని దానశీలమును బరీక్షింపనెంచి కుమారస్వామి బ్రాహ్మణవేషధారియై వచ్చి, వారి యిరువురు పుత్రులను దనకు దానము చేయుమనెను. ఇదివరకు జేసిన దానములకంటె నియ్యది యుత్కృష్టమైన దగుటచే భార్యాభర్త లొకింత తడవాలోచించిరి. తుదకు ధైర్యముతో వారు పిల్లలను బ్రాహ్మణున కర్పించిరి.

ఈ పరీక్ష యింకను జాలక ఇంద్రుడు మాయవేషమునవచ్చి "కుమారవర్మరాజా, నీయొక్క దానమహాత్మ్యము విని, నీకొరకై యీ యడవుల వెంట వచ్చితిని. నా కిచ్చ వచ్చిన రీతి దాస్యముచేయు స్త్రీ యెచ్చటను గానరాలేదు. నీ భార్యను నాకు దానిసగా జేసితివేని యెంతయు సంతసించెదను. వెనుకంజవేయక నాయభీష్టమును నెఱ వేర్పుము"అని యతిదీనముగా వేడుకొనెను. తనకు బ్రియమైన వస్తువుల నిచ్చివైచెను; రాజ్యము నిచ్చివైచెను; పుత్రుల నిచ్చివైచెను; భార్యను గూడ దానముచేయు నత్కృష్టముహూర్తము వచ్చినది గదా యని యత డొకింత తడయాడెను. అది గమనించి సంగనాచి "నాథా, సంశ యింప బనిలేదు. దానము కంటె మనకు వేఱొండు ప్రియతమమైన కార్యములేదని యెఱింగియు వగవనేల? నేను దానిసగా బోవుదును." అని చెప్పెను. అది విని ఇంద్రుడు ఆనందమును బట్టజాలక, తన నిజ రూపమును వెల్లడించి, వారి నుద్దేశించి, "రాజదంపతులారా, శాశ్వత కీర్తి సంపన్నులారా, దానశేఖరులారా, మీ జీవిత మెంతయు ధన్య తమము. ఏ జన్మపూజాఫలమో కాని, మీ యీ జీవితము పునీ తము. మీ దానశీలమును బరీక్షింప నెంచి దేవతలగు మేమిటుల గావించితిమి. సంగనాచివంటి స్త్రీగాని, కుమారవర్మవంటి పురుషుడు గాని, యీ కాలమున మఱొకరు లేరు. మీ మహాత్మ్యమునకు మెచ్చితిని. పోయిన వన్నియు దిరిగి మీకు లభించును. తిరిగి రాజ్యపట్టాభి షిక్తులు గండు" అని యాశీర్వదించి యదృశ్యుడయ్యెను.

ఉత్తరక్షణముననే, మహాబలిపురములోని జనులు కుమార వర్మకై జయధ్వానములు గావించుచు వచ్చిరి. వారి యాశీస్సు లందు కొని, యా రాజదంపతులు స్వస్థానోన్ముఖులై వచ్చుచుండగా, కులో త్తుంగ చోళుడు మనుమల నిద్దఱ నెత్తుకొని యెదురువచ్చెను. అంద

ఉను రాజదంపతుల పునర్దర్శనప్రాప్తికి పరవశులై, యానంద వీచికలపై దేలి యాడిరి. మహా బలిపురమున నఖండవైభవోపేతమగు పట్టాభిషేక మహోత్సవము జరగెను.

పిన్ననాటినుండియు గట్టుదిట్టములలో బెరిగి తల్లిదండ్రులయెడ నాదరణానురాగమును, గురువులయెడ భక్తియు గలిగియుండి, భర్తకు దోడు నీడయై, కలిమిలేములందు నేకరీతి నుపచర్యలు చేసిన సంగనాచి యొక్క చాతుర్యము, విజ్ఞాన తేజము, భక్తివిశ్వాసములు, పతిభక్తి స్త్రీలోకమున కెల్లకాలమునకును నాదర్శప్రాయములు.

## ఆఱవకథ: *** సోదరి నివేదిత.

### 1

ఎటుల నామె నెఱుకచేయుట? ఏవిధముగ నామె ప్రఖ్యాత ప్రభావములను వెల్లడిచేయుట? వక్త యనియూ, వేదాంతి యనియూ, ఉత్సాహిని యనియూ, సౌందర్య పిపాసిని యనియూ, మానవసేవా పరాయణురా లనియూ, ఎట్లు ఆ నారీరత్నమును బేర్కొనుట! పుట్టి పెరిగినది యొకచోట. వెల్లివిరిసినది వేఱొకప్రాంతమున. ఒకానొక పుష్పోద్యానమునందలి జీవితవల్లరి పూర్వపుణ్యపరిపాకముచే నరిహద్దుల నతిక్రమించి వేఱొక తపోవనమందు రససిద్ధిని బడసి యనిర్వాచ్యమగు జీవితకుసుమపరిమళమును విరజిమ్మినది. ప్రతిధ్వనించుట లేదా, నేటికినిగూడ నాయమ పునీతజీవితయశోగానము భారతదేశ హృదయాంతరాళమందు!

1867 వ సంవత్సరము అక్టోబరు మాసమున ఇంగ్లాండులో ఐరిష్ జననీజనకులకు బ్రాప్తించినది మార్గరెట్ నోబిల్ బాల. పుట్టినదాది యామె పుణ్యకథాశ్రవణమందును, పురాణపఠనాపేక్ష యందును, సత్యధర్మమార్గానుసరణమందును, పరోపకారచింత యందును నాసక్తికలదై మెలగుచుండెను. తల్లిదండ్రుల యాప్యాయ వీక్షణముల బెరుగుచు నామె క్రమశిక్షణాభ్యాసమును బొంది యశేష విద్యాప్రావీణ్యమును సంపాదించి వింబిల్డన్ యందు దొక పాఠశాలను స్వయంకృషిచే నెలకొల్పి స్వయంసహాయముచే నాపాఠశాలను బోషించుచు విద్యాభిలాషులకు విద్యాదానము చేయుచుండెను.

ఇట్టి మహత్తరకార్యమగ్నమై యున్నపుడే నోబిల్ కన్యకామణి కన్నులకు వివేకానందస్వామి గోచరించెను. అప్పుడే యామె

వీనులకు భారతవాణి వినంబడినది. శ్రీరామకృష్ణపరమహంసమహా మహుని ముఖ్యశిష్యవర్గమునకు జెందిన నరేంద్రసింహుడే, వివేకానంద నామమున, నీశ్వరసందేశమును బ్రపంచము నంతకును వెల్లడింప బయల్వెడలెను. గురుపాదారవిందముల భజించి, వాని వాగమృతరసాస్వాదముచే భక్తిపథముల స్వైరవిహారముజేయ శక్తిగల్గినవాడు, వివేకానందుడు. దైనందినవ్యవహారలీలాయుక్తచిత్తులై, హ్రస్వదృష్టి గలవారై, యీశ్వరచింతనకును, మతైకజీవితమునకును, దూరంగతులై చరించుచున్న పశ్చిమదేశవాసులకు, భారతసందేశమును దెలుప నుంకించి వివేకానందుడు యాత్రవెడలెను. ఇంగ్లాండునందుండగా, నోబుల్ కన్యక వాని యుపన్యాస పరంపరలకు జెవియొగ్గి, కొంత మానసికాందోళనమును బొందెను. కాని యా స్వామి చెప్పెడి ప్రతి విషయమునకును నామె హృదయ మొప్పుకొనలేదనినచో, నామె విజ్ఞానఫల మింకను పరిపక్వదశను బొందలేదని గ్రాహ్యము. ఇది జరిగినది 1895 నందు.

## 2

ఇంగ్లాండునుండి వివేకానందస్వామి అమెరికా దేశమునకు వెడలి దిగంత విశ్రాంతకీర్తియుంతుడై, 1896 లో ఇంగ్లాండునకు దిరిగివచ్చెను. అప్పుడుకూడ నోబుల్ కన్య వానిని గలిసికొనెను. ఆమె దృక్పథమం దెక్కుడు మార్పు కలుగక పోయినను, నామెయందు సుప్తమై దాగియున్న మహాశక్తి నొకదానిని వివేకానందుడు కనుగొని, "మా దేశమునకు వచ్చి, మా స్త్రీల యభ్యుదయమునకు దోడ్పడవలసినది" యని యామెకు సూచించెను. అదియే యొక మహత్తర దివ్యనాదముగ బ్రజ్వరిల్లి నోబుల్ యొక్క భావిజీవితము నంతను

మార్చివైచి యున్నత పథమునకు గొంపోయెను. ఆనాటి వాగ్దాన నిర్వహణమునకై మార్గరెట్ యువతి 1898 వ సంవత్సరములో మరల హిందూదేశమునం దడుగిడెను.

అప్పటినుండియు నామె వివేకానందుని శిష్యులతో మెలగుచు నుండెనేకాని, యింకను పూర్ణముగ నా స్వామియొక్క సుజ్ఞాన వంశీనాద వశము కాలేదు. అందుచేత తోడివారలతోc దర్కములు, చర్చలు జరపుచు నాత్మోపలబ్ధికి బునాదులు వైచుకొనుచుండెను. తుదకొక దినాంతమున నూతన చంద్రోదయచ్ఛాయ లాకసమున రేకెత్తువేళ వివేకానందుడు వివశాత్ముడై "ఈశీర్షోదయ తరుణముననే మన జీవితాధ్యాయమునం దొక నూతనపుట ప్రారంభింపబడుగాక" యని యుచ్చస్వరమున బలికెను. నోబుల్ యువతి కొంతవడి యంతర్ముఖియై తన పూర్వజీవితమును, పూర్వనామమును గూడ మఱచి, సోదరిని వేదిత యనుపేర నప్పుడప్పుడే తన భావిజీవిత కర్పూరమును జగద్ధాత్రియాలయమున మానవసేవకై యర్పణము జేసెను. అప్పటినుండియు నామె చెప్పుటకంటె చేతయే ప్రాధాన్యముగ నెంచి, సోదరీసోదరుల కందఱకును జాతిమతాదితారతమ్యములను బాటింపక సేవజేయ నవలంబించెను.

ఆ మహోన్నత ధర్మసిద్ధికై నివేదిత కలకత్తానగరమున నివాస మేర్పరచుకొని యచ్చట హిందూసంఘములో నొక స్థానమును సంపాదించుటకై ప్రయత్నించెను. అది కష్టతరమైన కార్యము. అప్పటికింకను మనదేశీయులు సంఘసంబంధమైన కట్టుబాటులను, జాతి భేదములను నతిక్రమించుట నంతగా నెఱుగరు. అట్టివారు నివేదితను దమలో నొకరుగ నెట్లు పరిగణింపగలరు? వారామెను నసూయతోడను, నసహాతోడను జూచుచుండెడివారు. కాని కాలము జరిగిన కొలది నివేదిత తనయొక్క నిర్మల జీవితముతోడను, ధర్మశీలము

తోడను, సేవాపరాయణతచేతను నెల్లర హృదయములను నాకర్షించుటయేకాక వారిని బూర్తిగ వశముజేసికొనెను. అనతికాలములోనే యామె వారికి గురువై మతబోధచేయుచు సన్మార్గములను జూపుచుండెను. అప్పుడే "సోదరీ సమితి" యను నొక సమాజము స్థాపితమయ్యెను. దానికి జేయూతగా నొక పాఠశాలనుగూడ స్థాపించి బాల బాలికల విద్యాభ్యాసమున కెంతయో యామె తోడ్పడెను. పాఠశాలాభివృద్ధియే పరమావధిగ బరిగణించి కృషి సల్పెడిది. ఈ విధముగ నామె యానాటి కలకత్తాసాంఘికజీవితమున నొక మహావ్యక్తియై పరిణమించెను.

## 3

ఆ సమయముననే మహామారి (ప్లేగు) ప్రజ్వలించిన సందర్భమున నివేదిత కొలది శిష్యవర్గముతో గలిసి వ్యాధిపీడితుల బాధా నివృత్తికై ప్రాణములనుగూడ సరుకుగొనక పరోపకారపారీణతను ప్రకటించెను. ఈవిధముగనే వంగరాష్ట్రమున 1906 లో వరదలు వచ్చి యపారనష్టము కలిగెను. ఆసమయమునగూడ నివేదిత తన కరుణామయసేవాచ్ఛాయలను పీడితులపై బరపి వారి కష్టనివారణకెంతయో శ్రమపడెను. ఇటుల దరిద్రనారాయణుని సేవానియతియందేగాక నివేదిత తఱచు దేశాటనము గావించుచు స్త్రీ పురుషసమూహములకు జీవిత సమస్యలనుగూర్చి విపులముగ వివరించుచుండెడిది. నీతి మత సాంఘికాధ్యాత్మికాది సమస్యల నన్నిటినిగూడ నామె ప్రజలకొఱకై తర్కించి సుబోధకముగ వివరించెడిది.

నివేదిత యుపన్యాసముల మూలముననేగాక రచనలచేతగూడ విశ్వమానవ సేవాసందేశమును వెల్లడించెను. "కాళీమాత" "హిందూ

పురాణకథలు'' "భారతజీవిత చరిత్ర'' మొదలగునవి యామెయొక్క ముఖ్యగ్రంథములు. జటిలత నెఱుగని భావసౌష్ఠవము, క్లిష్టతలేని పదగుంభన, యాడంబర రహితమైన వ్యక్తీకరణము ఆమెయొక్క రచనల కెంతయేని మెఱుగువెట్టుతఱి నా గ్రంథములు భారతదేశ హృదయాంతర రహస్యమహిమను వెల్లడించు దీపకళికలై విరాజిల్లుచున్నవి.

అట్టి మహనీయురాలు, యశోధనవంతురాలు 1911 లో డార్జిలింగ్ నగరమున తనువును బాసెను.

దేవతాశీర్వచనముల బొంది జననమందిన యుత్కృష్ట జీవులలో సోదరి నివేదిత యొకతె యనుట నిర్వివాదాంశము. ఆమె జీవిత పరిణామమును, జీవిత వికాసమును సంపూర్ణముగ గ్రహించినయెడల నామె యెట్టి పూజ్యురాలో, యెట్టి పుణ్యవతియో మనకు స్పష్టము కాగలదు.

---

# ఏడవ కథ: *** సతీవాక్పుష్ట

## 1

మన భారత దేశమందు గల రాష్ట్రము లన్నిటిలోనికిని సస్య వంతమైనదియు, సకలవస్తుసమృద్ధమైనదియు, సౌభాగ్యవంతమైన దియు కాశ్మీరము. నేటికాలముకంటె పూర్వము దాని గొప్పతనము వేయి మడుంగు లధికముగ నుండెడి దన్న నతిశయోక్తి కాదు. సింధు స్రవంతీమతల్లి సలిలములచే జోహారుచేయబడిన యీ రాష్ట్రభాగ్య మేమని పొగడవచ్చును.

ఆ కాశ్మీర దేశమును వాసిగ బరిపాలించిన పూర్వరాజులలో తుంజీనుడు మేటి. సావధానచిత్తుడును, సర్వసద్గుణోపేతుడును నగు నా ప్రభువునకు, సకల సద్గుణసాంద్రయు, సౌందర్యరాశియు నగు వాక్పుష్ట యను నారీతిలకము భార్యయై యొప్పుచుండెను. దైవభక్తియందును, దానపరత్వమునందును; దయాదాక్షిణ్యములందును, ప్రజానురాగము నందును, నవి యివి యననేల, జీవితమునందలి యుత్తమవిషయము లందన్నిటియందును నా రాజదంపతుల యాశయములేగాక, యాచర ణలుగూడ నొక్కటియై యుండెను. అట్టి యనుకూలదాంపత్యము దేవాంశ సంభూతులకు దక్క మఱొక్కరికి దక్కునా!

దైవవశమునను, బూర్వజన్మసుకృతము వలనను సతీపతులుగ గూర్చబడిన సీ. తుంజీనవాక్పుష్టలు తమయొక్క యాధ్యాత్మికౌన్నత్య మునకు బునాదులు వైచుకొనుటయేగాక ప్రజాపాలనమునందుగూడ నెక్కుడు భక్తిశ్రద్ధలు వహించి, ప్రజలను గన్నబిడ్డలవలె గాంచుచు నన్నివిషయములందును వారి శ్రేయస్సునకు దోడ్పడుచుండిరి.

దేశమునం దెచ్చటను నరాచకముగాని, యసంతృప్తిగాని లేదు. కలహములుగాని, కార్పణ్యములుగాని కానరావు. తల్లిదండ్రుల రీతి ప్రజాసౌఖ్యమే తమదిగ భావించి రాజ్యము నేలుచున్న నీ తుంజీన వాక్పుష్టలను జనులందఱును భక్తిశ్రద్ధలతో గౌరవింపుచుండిరి. ఎట్టి విధమైన లోపమును ననుభవింపక వారు రామరాజ్యమునాటి యానంద ముగ గాలము గడపుచుండిరి.

## 2

కాని కాల మెప్పుడు నొక్కరీతిగ గడువబోదు. ఎట్టి వారైనను గాలచక్రపరిభ్రమణమును మారల్పజాలరు. కాశ్మీరదేశమునకు గూడ గష్టకాలము సంభవించెను. సకల సస్య భరితమై యొప్పు నా దేశమునకు నొక సంవత్సరము కాటకము సంభవించెను. వర్షములులేవు. పంటలు లేవు తన్మూలమున నెచ్చట జూచినను నిరుత్సాహము, నిరాశ. ప్రజలు గుంపులు గుంపులుగ జేరి కర్తవ్యము నాలోచించుచుండిరి బయటనుండి సరకులు గొనితెచ్చుటకైనను దేశమునందలి ధనమెంతకాలము సరిపో గలదు? రాజధనాగారమునుండి ధనము విరివిగ ఖర్చుపెట్టబడుచుండెను. కాని, యీ ప్రయత్నము లెట్లు ప్రజలకు తృప్తి నొసంగగలవు? సమృద్ధిని నోలలాడిన వారీ కష్టముల ననుభవించు టెట్లు?

రాజదంపతులును దేశమునందు గల్గుచున్న సంక్షోభమును నివారించుటకై తగు ప్రయత్నములు గావించిరి. వాక్పుష్ట యుదారహృదయ. ప్రజల యవస్థనజూచి జాలిజెంది వేనవేలజనమునకు గోటయందే భోజన సౌకర్యముల నేర్పాటు జేసెను. ఆ యన్నాతురుల నందఱి నామె మృదుమధురమైన కుశలప్రశ్నలతో నోదార్చి తృప్తి నొందించెడిది. కన్నతల్లియైనను నంత యావేదన ననుభవింపదన్నచో నాశ్చ

ర్యము లేదు. తమపాలన మందున్న ప్రజలకా యిట్టి కష్టములు? అని దైవము చేసినవే యైనను జనులబాధలను నివృత్తిజేయుట పాలకుల బాధ్యతకాదా! అయినను వేనవేలను రక్షించుటెట్లు? దినములు జరగుచున్నవేకాని తెరపి కనుపించుటలేదు. క్షుద్బాధ కాగలేక యే దినమున కాదినము పెక్కుమంది మృత్యుముఖమున బడుచుండిరి. గతించినవారు గతింపగ సజీవులైనవారి యాక్రందనము లాకసము నంటుచుండెను. అంతయు జూచినను దలచుకొనినను వాక్పుష్ట మనస్సు కలతజెందుచుండెను. తన పూజలు, ప్రార్థనలు అన్నియు నేమైనవా యని యాలోచించెను. ఎంతమంది దేవతలకో మ్రొక్కినది. ఎన్ని తపములనో చేసినది. చేయించినది. కాని యేమిఫలము? ఈశ్వరాజ్ఞ యనుల్లంఘనీయము.

## 3

తుంజీనుడు తన నిస్సహాయతకుఁ గుంది, యేమియు దోచక నిస్పృహతో నాత్మహత్యకు గడంగ నుద్దేశించుచుండెను. అట్టి కార్యము కడుంగడు దోషమే యని వానికి దెలియును. కాని జీవించియుండి జనుల బాధలను జూచుచుండుటకంటెఁ జనిపోయిన మేలని భావించి యాప్రయత్నము చేయసాగెను. వాక్పుష్ట నిష్కల్మషహృదయ. భర్తనే దైవముగ బూజించిన పతివ్రత. ధర్మనిష్ఠయే 'మణిపూస'గాగల సతీశిరోమణి. అట్టి యామె కీ రహస్యచర్యాఛాయ ముందుగనే కానబడెనన్నచో వింతయేమి? భర్త యీ తీర్మానమును జేసినప్పటినుండియు వాక్పుష్ట హృదయమున నేదియో తట్టి 'జాగ్రత' యని చెప్పుచునేయుండెను. అందుచే భర్త దీనముగ బరుండియున్న మందిరమును బ్రవేశించి చుట్టునున్న పరివారజనము నావలకు బనిచి యామె భర్తకు ముమ్మారు

ప్రదక్షిణము గావించి పాదములచెంత జాలిగొల్పుచు నిమీలితనేత్రమై కూర్చుండెను. పతిభక్తిపరాయణ యగు నామెనుగాంచి తుంజీనుడు రహస్యమును దాచుకొనలేక తాను సంకల్పించుకొనిన విధానమును వెలిబుచ్చి యందుల కనుజ్ఞ నిమ్మని యామెను వేడెను.

వాక్ప్రష్టయు నొక్క నిమేష మూరకుండి "మీరు నిశ్చయించుకొనిన కార్య మేమాత్రము సమంజసము గాదు. జీవితమం దెన్నికష్టములు సంభవించును? ఇప్పుడు కల్గిన దొక లెక్కయా? ఆపదలందు ధైర్యము వలయును. భీరువులై చరింప పాడియా? అందును రాజకులమునందు జన్మించియా? ప్రజల కష్టములను నివారించుటకు సర్వవిధములఁ బ్రయత్నించితిమి. ఇంకను బ్రయత్నింతము. ఒకపరియైనను మన ప్రార్థనలు నెరవేర్పడా యీశ్వరుడు? కావున మీ యాలోచన విసర్జింపుడు. ఈ దినమునకైన నూరకుండుడు. నేను పాతివ్రత్యశిరోమణినైతినేని, నా పతిభక్తియు, దైవభక్తియు నిర్మలమైనవి యయ్యేనేని, నా కోరిక ప్రకారము సాయంసంధ్యాత్పూర్వము, దేశమునందు తిరిగి సమృద్ధి సంభవింపగలదు'' అని శపథము చేసెను.

తుంజీనుడు నిద్దురనుండి లేచినవానివలె దెప్పరిల్లి యెదుటనున్న తన సతీతిలకమునుగాంచి "పతివ్రతల వాక్కులు వ్యర్థమగునా? నా నీచాలోచనను విరమించితిని. నీ పాతివ్రత్యవిశేషమున దేశమునందు శాంతి ప్రబలుగాక'' యనెను.

ఇంకను సూర్యుడ స్తమించి యాకసమున చీకటు లల్లుకొనలేదు. రాజ్యమందంతటను ప్రతిగృహమునందును సమస్తవస్తువులును సమృద్ధిగ నుండెను. ప్రజల ముఖముల నానందము మొలకలెత్తెను. జరగిన కష్టకాలమంతయు నేరికిని జ్ఞప్తియే లేదు. పీడకల వచ్చి కలవరపెట్టి

పోయినట్లయ్యెను. 'ఈ సమృద్ధి యెటుల కల్గెను? ఎక్కడనుండి కల్గెను' అని ప్రశ్నయే లేదు. అంతకును కారకురాలైన వాక్పుష్ట వనితా మణికే ప్రజలు ధన్యవాదములు సల్పిరి.

చూచితిరా వాక్పుష్ట సతీమతల్లియొక్క పతిభక్తి, ప్రజా సేవానురక్తి, క్షమ, సహనము. పతికి తోడునీడయై, కష్టసుఖముల యందు వాని సహధర్మచారిణియై వర్తించి పుణ్యవతీ లలామయై, వాక్పుష్ట ఆదర్శప్రాయయై విరాజిల్లుచున్నది. ఆమె పుణ్యనామమే సర్వజనధ్యేయము. ఆమె చరితమే సర్వశుభప్రదాయకము.



# ఎనిమిదవ కథ: *** ఉత్తర.

## 1

హైందవ సాహిత్య సింధువునందు స్వప్రకాశితములై భాసిల్లెడి మంచి ముత్యములలో భారత మొకటి. ఆ గ్రంథనామము విననివారు గాని, యీ కథాసారాంశమును గ్రోలనివారుగాని హిందువులలో నెవ్వరును నుండరు. భారతమును 'పంచమవేదము' అందురు. కురు పాండవ రాజవంశములకు సంభవించిన కష్టపరంపరలను దెల్పునది మాత్రమే కాదు భారతము. సద్గుణమునకును, దుర్గుణమునకును, సద్భావమునకును, దుర్భావమునకును సంఘటించు వైరము, తుదకెట్లు మరా శా మేఘములు తొలగి సత్యభానుడు ప్రకాశించునో, యందు వ్యక్తీక రింపబడినది.

కౌరవపక్ష దుర్యోధనాదివీరుల మాయోపాయము వలన జూదమునం దోడింపబడుటంజేసి, పాండవవీరు లైదుగురును పతివ్రతా మతల్లియగు ద్రౌపదితోగూడ పండ్రెండు వర్షము లరణ్యవాసమున కేగ వలసివచ్చెను. తదనంతర మొక వత్సర మజ్ఞాతవాసము చేయవలసి, పాండవులు విరాట మహారాజు కొలువు కూటమున బ్రవేశించిరి. విరాటరాజు ప్రఖ్యాతివడసిన మత్స్యదేశమునకు ప్రభువు. శమదమాది షట్కర్మ నిరతుడును, దానధర్మ సత్యవాక్య పరిపాలనా నిష్ఠాగరిష్ఠు డును నగు నా విరాటభూపాలుని ప్రతిష్ఠ, దిగంతములకు వ్యాపించి యుండుటచే నట్టివాని సేవయందు సౌఖ్య ముండునని గ్రహించి వాని చెంతజేరిరి. అందఱును మాయావేషములను, మాయా నామము లను మెలగుచుండిరి.

పాండవ మధ్యముడగు అర్జునవీరుడు, బృహన్నల యను పేరట లలితకళలయందు ప్రావీణ్యమును బ్రదర్శించుచుండెను. వాని కౌశలము నకు మెచ్చి, విరాటప్రభువు తన యనుంగు కొమార్తెయగు ఉత్తరకు నృత్యసంగీతాది కళలను గఱపుటకు బృహన్నలను నియమించెను. చెలి కత్తెలతోఁగూడ ఉత్తరకన్యక గురూత్తమునిచెంతఁ గౌతుకముతో శిక్షాక్రమమును నేర్చుకొనుచుండెను. నేర్పుచున్న దంతయు నాతుర తతోఁ దెలిసికొనుచు, దన బుద్ధిసూక్ష్మతను గనబఱచుచున్న శిష్యు రాలిని జూచి, బృహన్నల యపరిమితానందాంతరంగుఁ డగుచుండెను.

## 2

ఈ విధముగ పాండవాజ్ఞాతవాసము చాలభాగము గడచి పోయిన పిదప, వారి జాడ కౌరవ ప్రముఖులకు దెలియవచ్చెను. అప్పటి నుండియు వా రెవ్విధముగనైన మత్స్యరాజ్యమును ముట్టడించి, పాండవులను వెలికిలాగి కనుగొని, నియమభంగమును గావింప నిశ్చ యించుకొనిరి. తన్నిమిత్తమై కొంత కౌరవసేన మత్స్యదేశముయొక్క దక్షిణపరిసరముల దిరుగాడు గోవులను బట్టుకొనెను. ఆ యపాయ నివారణకై విరాటరాజు సైన్యముతో నచ్చటకు బోయెను.

ఆ సమయముననే మఱికొందఱు సైనికులు ఉత్తరగోగ్రహ ణమునకు గడంగిరి. వారి నెదుర్కొనుటకై యెవ్వరును లేరు. రాజాంతః పురమున నా నిస్సహాయత పిడుగువలె జొచ్చెను. సైరంధ్రీ నామమున రాణివాసమున మెలగుచున్న ద్రౌపది యంత బృహన్నల యొద్దకు బోయి "నాథా! మనకు నాతిథ్య మొసంగి రక్షించుచున్న ప్రభువుల కాపత్తు సంభవించినది. దక్షిణపునైపు రాజ్యమును రక్షించుట కెవ్వ

రును లేరు. ఈయాపత్కాలమున నడ్డువడి మన సేవాధర్మము నిర్వ హింపుడు'' అని వేడుకొనెను.

బృహన్నల వీరశిఖామణి. యుద్ధాశ్వము శంఖనినాదము వినుట తోడనే యుబికి కదను ద్రొక్క ప్రారంభించును. అట్లనే, యింతకాలము నిద్రాణమైయున్న వీరశక్తి అర్జునుని హృత్సీమయందు పల్లవించి, తాండవమాడెను. అంత అర్జునుడు రథసారథ్యము వహింప ఉత్తరుడు రణభూమికి బయలుదేరెను. కొదమసింగములవలె వారిరువురును శాత్రవ హింసకు జను సమయమున ఉత్తరవచ్చి "ఆవైరివీరుల రంగురంగుల పాగాల పేలికలు నాబొమ్మల పెండ్లికి నుపకరించును. తెచ్చిపెట్టెద రుగా!" యనెను. ఆచిన్న కోరికె యా వీరమణుల కొక లెక్కయా!

భండనభూమిని శత్రుసంహారలీల జరగినది. తిరిగి వారు రాజ ప్రాసాదము చేరుసరికి నటనుండి విరాటరాజు విజయలక్ష్మీసమేతుడై వచ్చెను. అప్పుడాతడు ఉత్తరుని వలన బృహన్నల నిజవృత్తాంత మెఱింగి, వానిని గౌరవపురస్సరముగ గౌగిలించుకొని, వాని యథార్థము దెలియక యిన్నిదినంబులు సేవచేయించుకొనినందులకు మన్నింపుమని వేడు కొనెను. అందులకు అర్జునుడు నవ్వుచు వాని యొక్క గౌరవ మర్యా దలను గొనియాడెను. ఇదంతయు నచ్చటనుండి వినుచున్న ఉత్తర నిరుత్తరయై అర్జునుని సమక్షమున నింతకాలము విద్యాభ్యాసము లభించి నందులకు సంతసించి వినయ విధేయతలను, భయభక్తులను వెల్లడించెను.

అప్పుడామె తండ్రి యానందాతిశయము పట్టజాలక "పాండవ వంశతిలకా! వీరాగ్రేసరా! లోకవిఖ్యాతకీర్తిసాంద్రా, మీ రాకచే మా రాజ్యమును మా మందిరమును బునీతమైనవి. మీయొక్క యను

రాగ ప్రాభృతముగా నీ ఉత్తరకన్యను గైకొనుడు" అని విన్నవించెను. అర్జునుడు అమితానందుడై "విరాటరాజా! విస్ఫురిత కీర్తి నిస్తంద్రా! నీకానుక కెంతయును సంతసించితిని. నీకుమార్తె దేవాంశసంభూతురాలు. మహాపుణ్యవతి. నాయెడ శిష్యత్వముచేతగూడ నామె మిన్నయైనది. ఆమెను నా కోడలుగ బరిగ్రహించెదను" అని నుడివెను.

# 3

అంత శుభముహూర్తమున ఉత్తరాభిమన్యుల సుద్వాహము గావింపబడెను. శౌర్యపరాక్రమోపేతుడును సాహసౌదార్యసంపన్నుడును, పాండువంశ సాగరోద్భూతమణియు నైన అభిమన్యుడును, వినయవిధేయతాసంపన్నురాలును ఉత్తమలక్షణ విఖ్యాతురాలును, సకల సద్గుణ యశశ్శ్రీమంతురాలును, నైన ఉత్తరయు భార్యాభర్తలుగ జీవితయాత్రకు గడంగిరి.

కాని వారి యాత్రామార్గానుగమన మెంతకాలమో సాగ లేదు. విశ్వపురుషుని లీల లగ్రాహ్యములు. మరి కొలదిమాసములకే యుద్ధమేఘము లాకసమునంతను నలముకొన జొచ్చెను. అధర్మ భుజంగము ఫణాగ్రము నెత్తి ధర్మదేవతను కబళింప నుంకించుచుండెను. నీల మేఘశ్యాముడు, కృష్ణభగవానుడు, చక్రపాణియై సూత్రమును త్రిప్పు చుండెను. ఇంకను నిద్రామాంద్య మెక్కడ? పాండవకౌరవాక్షౌహిణులు, బలాబలములను బట్టిచూచుకొను సమయ మేతెంచెను. యథార్థమును స్మరించి, కౌరవులు కుపితులై మాయోపాయములకు గడంగిరి. ఎవ్వరికిని భేద్యముకాని యొక పద్మవ్యూహమును బన్నిరి. దాని భేదనశక్తి అభిమన్యునికడ నుండెను. అతనికి దక్క మఱి యొకరి కది సాధ్యముకాదు. కావున అభిమన్యుడే పోవలసివచ్చెను. వయస్సున

పిన్నవాడు. తల్లియగు సుభద్ర కేకపుత్రుడు. భార్యయగు ఉత్తరకు నూతన లబ్ధుడు. పాండవకులమున కాయువుపట్టు. పినతండ్రు లొక్కరొక్కరే వాని నాశీర్వదించిరి. సమక్షమున తండ్రి లేడు. భార్య వీర వనిత. భర్త ప్రయాణము నడ్డువెట్టలేదు. గర్భవతిగ నుండియు, నామె తన జీవితమం దప్పుడొక మహోత్కృష్టనిమేషము ననుభవించె నన్నచో వింతగాదు.

అభిమన్యుడు ఆయుధపాణియై రణమునకుబోయి, వ్యూహమును జొచ్చెను. కాని తిరిగి వెలికి రాజాలడయ్యె. ఆ శూరసింహమునకై గురుడు పన్నిన మహావ్యూహ మది. ఎట్టి నీచకార్యము! ఎట్టి హేయ వ్యూహము! కాని శత్రువులు చేయదలచినది సానుకూలమైనది. ఆ వ్యూహామధ్యము నందే అభిమన్యుడు వీరస్వర్గసోపానముల నెక్కి యంతర్హితు డయ్యెను.

## 4

ఆనాటి పాండవ చమూపతుల విచారమునకు మేరలేదు. వారి యభిమానపుత్రు డంతమొందెను. ఉత్తర హతాశురాలు. నోటమాట లేదు. కంటచూపులేదు. ఒక మహాదుష్టభావ మామె ప్రాణములను బిగియబట్టినది. ఆమె జీవితవాహిని యొక్కుమ్మడిగ సంతరించినది. భావమాత్రముననే సహగమనము చేసి, ప్రాణములనుబాసి, భర్తతో గూడ మృత్యుపథముల ననుసరింప శక్తిసామర్థ్యములు గల్గిన యువతీ రత్నమామె. కాని గర్భమందున్న శిశువుకై కష్టమంతయు నుగ్గబట్టుకొని, నిశ్చలమనస్సుతో వేచియుండెను.

యుద్ధము చాల భాగము ముగిసినది. ఆ మహాప్రళయ మూలమున భారతభూమి యంతయు శోషిల్లినది. ఆర్యపుత్రరత్నము లెందఱో

మడిసిరి. కౌరవపక్షపాతి యగు అశ్వత్థామ, పాండవవృక్షమును కూకటివేళ్ళతో బెకల్చ సమకట్టిన వీరుడు. ఉత్తరగర్భమునుండి జనించు శిశువు పాండవవంశ పునరుద్ధారణకు గారణభూత మగునేమో యను సంకోచముతో, అశ్వత్థామ బ్రహ్మశిరోనామమునఁ బరగు నస్త్రము నామెపై బ్రయోగించెను. ఆ యస్త్రాగ్ని కోర్వజాలక ఉత్తర గద్గదికతో కృష్ణపరమాత్ముని మఱుగు జొచ్చెను. ఆ కరుణా సింధువు ఆ యార్తత్రాణపరాయణుడు ఆ పాండవశ్రేయోభిలాషి తన మహిమచే నా యస్త్రపటిమ నాపివైచెను. పిదప నవమాసాం తమున శుభలగ్నమున ఉత్తర మగశిశువును గనెను. పరీక్షిత్తు అను నామమున నాబాలుడు దినదినప్రవర్ధమాను డయ్యెను. పుణ్యపూజాఫల మగు నాముద్దుల తనయునిపై దన యాశాలత లన్నింటిని నాధారము జేసికొని వానికి సత్సాంగత్యమును, వీరధర్మమును, సత్యనిష్ఠయు, మున్నగు సద్గుణముల నామె గఱపుచుండెను. అప్పు డామె కొమారు నికై పడిన కష్టము, చేసిన సేవ, నేర్పిన విషయములే, పరీక్షిత్తుయొక్క భావిభాగ్యోదయమునకు మూలకందములై హిందూచక్రవర్తులలో వానికి సగ్రగణ్యతను జేకూర్చినవి. అట్టి కొమరుని గన్న వీరమాత, అట్టి భర్తకు భార్యయైన వీరవనిత, ఉత్తర భారతకాలమునాటి పుణ్య స్త్రీలలో నెల్ల ప్రాముఖ్యము గాంచి యలరారుచున్నది.

స ం పూ ర్ణ ము.

